


ఆరోగ్య సౌభాగ్యములకు
కేసరి రత్నత్రయము

# లోధ్ర

గర్భాశయ రోగ నివారిణి

ఈ ఔషధము ఉత్తమోత్తమము, నికరమయినదిగా యాభైఅయిదు సంవత్సరములుగా ప్రఖ్యాతిగాంచినది. స్త్రీల ప్రత్యేకమైన, ఋతుసంబంధమైన జబ్బులు, హిస్టీరియా, నిద్రలేమి, మలబద్ధకము. తలనొప్పి, వెన్నునొప్పి మొదలగు వాటికిది వరప్రసాదము.

# అమృత

రక్తశుద్ధి ద్రావకము

నిరుత్సాహుల నరములను బలపరచగల శ్రేష్టమయిన టానిక్. రక్తహీనత, అజీర్ణము మొదలగు జబ్బులయందిది నమ్మకముగ పనిచేయును.

# అరు

సర్వజ్వర నివారిణి

ఇది మలేరియా, ఇన్‌ఫ్లుయంజా మొదలగు జ్వరములను, జ్వరగడ్డలను కుదుర్చును.

పూర్తి వివరములకు:

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

తెలుగుజిల్లాలకు, ఒరిస్సాకు, నైజామునకు ఏజంట్లు:
శీతారాం జనరల్ స్టోర్సు, విజయవాడ, బరంపురం, సికింద్రాబాద్.

# మిమ్ముల నుద్దేశించే నమూనా కావింపబడ్డాయి



పసిపిల్ల లైతేనేం, శ్రీమంతుల బిడ్డ లైతేనేం, చేనేతవస్త్రాలను ఉపయోగిస్తే సరికొత్త విధానంలో సద్వినియోగం చేస్తున్నారన్నమాట.

సున్నితమగు వెంకటగిరి చీరెలు అందానికి, రమణీయతకు గంధర్వత్వానికి.

ఉజ్వలములగు బనారసు పట్టులు, బంగారు వెండిపోగులతో తళతళ లాడే రవికెగుడ్డలు ……………

ఒరిస్సా, బీహారు మాలుబట్టలు చలువకు, అనర్ఘమైన జానపద నమూనాలు....ఇంకా

చిత్రవంతములగు దక్షిణాది పట్టు చీరలు చిక్కని రంగుల మేళవింపులు, అతిమృదువైన చెంగులు

వీటికి సానురూపంగా మద్రాసు, హైదరాబాద్, బొంబాయి, బనారసుల అతి సుందరమగు "షాపులు"




# చేనేత వస్త్రాలు

*నవనాగరికులు అభిలషించేవి*

**ఆల్ ఇండియా హాండ్‌లూమ్ బోర్డు**

98, మౌబ్రేస్ రోడ్డు, మద్రాసు-18; షాహిబాగ్ హౌస్, విట్టెట్ రోడ్డు, బాలార్డ్ ఎస్టేటు, బొంబాయి & 7/192 స్వరూపనగర్, కాన్పూర్

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

వ్యవస్థాపకులు

డాక్టరు. కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౨౮] జూలై 1956 [సంచిక ౨

# విషయసూచిక

—(౦)—







నందీశ్వర పూజ




జయజయ గృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



## మంచిమాటలు

ఆంధ్ర మహిళా సభవారి యాజమాన్యమున నిర్వహింపబడనున్న నాగేశ్వర శిశువిహార్ ప్రారంభోత్సవ సందర్భమున శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారు అధ్యక్ష స్థానమునుండి ప్రజలకు అవసరమని తోచినప్పుడే ప్రజాహితమునుద్దేశించి, ప్రజాసేవకు సంస్థలు ఏర్పడాలని నొక్కి చెప్పిన విషయము గమనించతగినది.

శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారికి సంఘసేవలోగల అనుభవము అపారమైనది. ప్రజల సౌభాగ్యాన్ని హితాన్ని ప్రోత్సహించడానికి ఏర్పడు సంస్థలకు ప్రజల ఆదర సహకారాలు అత్యవసరము. వాని ఆవస్యకతను ప్రజలు గుర్తించిన నాడు సంస్థలు అవిచ్ఛిన్నముగా వర్ధిల్లగలవు. ప్రజావసరాలను సరిగ్గా అర్థముచేసికొనకుండా ఏర్పడిన ధర్మసంస్థల కార్యకలాపాలు విజయవంతంగా సాగకపోవడమే కాక ప్రజల అభిమాన సహకారములకు పాత్రముకాలేవు. ప్రభుత్వపు సహాయము కొద్దిగానో గొప్పగానో యిట్టి సంస్థలకు లభించినా, లభించక పోయినా ప్రజల సానుభూతి సహాయములున్ననేకాని యిట్టి ధర్మ సంస్థలకు ఆర్థికవసతులు విరివిగా నమరవు.

శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారి భార్య, కుమార్తె నాగేశ్వర శిశువిహార్ భవన నిర్మాణమునకుగాను షుమారు రు. 6000/-లు ఖరీదుచేయు స్థలమును, రు. 4500/-విరాళమునిచ్చి ఆంధ్రమహిళాసభ వారిని యీ సంస్థ నిర్మాణమునకు, నిర్వహణకు ప్రోత్సహించినందులకు అభినందనీయులు.

ఈ శిశువిహార్ పనిపాటలకువెళ్లే బీద స్త్రీల బిడ్డల పోషణకుగాను ఏర్పడినది. భార్యాభర్తలిద్దరు జీవనోపాధి నుద్దేశించి వెళ్లేటప్పుడు బిడ్డలపోషణ, రక్షణలను యీ శిశువిహార్ నిర్వహించి వారు తిరిగి యింటికిరాగానే పిల్లలు తల్లిదండ్రులకు ఒప్పగించ బడుతారు. ఇట్టి వసతుల మూలంగా బీదకుటుంబాలలోని ఆర్థికదుస్థితి కొంతతగ్గి ఆరోగ్య సౌభాగ్యాలు పెంపొందగలవు. ఇట్టి సంస్థలు అధికార, అనధికారుల నిర్వహణక్రింద అనేకం ఏర్పడవలసియున్నవి.

విశ్వదాతగా పేరొందిన శ్రీ నాగేశ్వరరావుగారిపేర యీ సంస్థ నిర్వహింపబడు చుండుట పేర్కొనతగిన విషయము.

——(o)——

# రాష్ట్రభాషగా హిందీ

హిందీ ద్వారా ప్రాంతీయ భాషలలో సామరస్యము సాధింపబడగలదని శ్రీ మోటూరి సత్యనారాయణగారు ప్రకటించారు.

కాని మునుపు ఇంగ్లీషు ప్రధానస్థానము నాక్రమించి ప్రాంతీయ భాషల అభివృద్ధిని పరిమితముచేసినట్లుకాక ప్రాంతీయ భాషలు ప్రధానమైనవిగాను, హిందీ, ఇంగ్లీషు సంస్కృతము ప్రాంతీయ భాష ననుసరించినవిగా నుండాలి.

వ్యక్తిత్వానికి లోటులేకుండా ప్రాంతీయ భాషల అభివృద్ధికి ప్రాధాన్యమివ్వాలి. యావద్భారతంలో పరస్పర, సమరస, సన్నిహిత సంబంధాలకు హిందీ అవసరమయితే అంతర్జాతీయంగా వివిధదేశాలను, వాని సమస్యలను అర్థంచేసికొని సత్సంబంధాలను నెలకొల్పుకోడానికి ఇంగ్లీషు అత్యవసరమైనది. ప్రాంతీయ భాషల అభివృద్ధికి విశేషంగా తోడ్పడగల సంస్కృతమును కూడ విస్మరించజాలము. ఒకటికి నాలుగు భాషలనభ్యసించినా వాని వాఙ్మయ ప్రభావమును తమ స్వీయభాష, సారస్వతముల అభివృద్ధికి వినియోగించుకోడం వాంఛనీయము.

# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ

ఉపనిషదులు

(గతసంచిక తరువాయి)



అనగా పరిమితుల దుఃఖములను తొలగించుకొనుచున్నాము, ఇది యంతయు సాకార బ్రహ్మయందలి భక్తి శ్రద్ధలవల్ల సాధ్యమగుచున్నది. మరి నిరాకార బ్రహ్మ ఉపాసన ఉన్నతధ్యానాభ్యాసము వలన సంపూర్ణమై జన్మరాశిని తరించగలుగుచున్నాము. నిరాకార బ్రహ్మధ్యానము వల్ల స్వానుభవ ఆత్మజ్ఞానము లభించినను, జీవన్ముక్తి స్థితియందు, ప్రశాంత తీక్ష్ణ అనుభవమునకు, ఆత్మరామునియందు అచల తీక్ష్ణ భక్తి ప్రేమ అత్యావశ్యకము.

కేవల వేదాంతానుసార పరిపక్వదశ పొందుట వల్లనే, మానవుడు మానసిక వైజ్ఞానిక నీచస్థితి పొందిన మానవ సంఘమును, వారితో జీవనము జరుపుచు, ఆ విద్యయందు కృషిచేయుచు సంఘము వారిని పునరుద్ధారణము చేయజాలడు. వైజ్ఞానిక సంస్కార విప్లవమునకు మహాపురుషులు అనేక రకముల సంఘటనల ఎదుర్కొనియు, మానసిక శాంతియు, సమత్వమును కోలుపోక వ్యవరింపగలందులకు మూల కారణము వారికి ఆత్మరామునియందుగల అనంత ప్రేమభక్తి, కారణములయి యుండుటవల్ల ఆ పరమాత్మ వారికి నిరంతశక్తియు మార్గదర్శమును యొసగు చుండును.

శ్రీ రామకృష్ణపరమహంస యొక్క, శక్తియు ప్రభావమును తన ఆత్మానుభవమువలన కలిగియుండెను. కాని, అతని శాంతము, సమత్వమును అతని ప్రియమాత దక్షిణేశ్వరీ యొక్క అశీర్వాదము వల్ల సమకూడియుండెను. హిందుమతమునే పునరుద్ధరించిన శ్రీశంకరులు, తన యొక్క అమానుష పరిపూర్ణతవల్లను, ఆత్మానుభవమువల్లను, కాలదేశ ఆవరణముల నతిక్రమించి ప్రకాశించగలిగెను. కాని అతడు శారదామాత, జ్ఞానదేవియందు గలిగియున్న తీవ్ర, అచంచల భక్తివల్లనే, హిందూదేశము దిక్కు దిక్కున పర్యటనము సలపి తనకాలపు విరోధ పక్షవాదులన దరని, ఎదుర్కొని, హీనస్థితిలో నున్న హిందూ మతమును, పునరుద్ధారము గావించి ఉన్నతజ్ఞాన సింహాసమున కూర్చుండ బెట్టగలిగెను.

ఈ శ్లోకమునందు మరణము అనగా, ఈ మర్త్య ప్రపంచమున సర్వపరిమితిగల విషయములకు అన్వయించుచున్నట్లు తెలుసుకొనవలెను. ఒక జ్ఞాని, రాధవంటి భక్తిగలిగియుండిననే పార్థసారథివలె చక్కని జీవితమును నడుపగలిగి, తనకాలపు రాజస, తామస జీవులనంతయు జనము సంప్రాప్తమగునట్లు రథమునుతోలి మార్గదర్శి కాగలడు.

ఈశ్లోకమునందలి మిగత భాగములంతయు, ముందు శ్లోకములలో వివరింపబడియున్నది.

ఇపుడు మనము ఈ ఉపనిషదు నందలి కడపటి అలను చేరియున్నాము. ఇదిచాలమంది విమర్శకులకు గొప్ప సమశ్యగానుంటున్నది.

ఉన్నత భాష్యకారులయిన శంకరులవంటివారికి ఇది, మరణావస్థలోనున్న మానవుని ప్రార్థనగా యున్నది. వైదిక హిందూకుటుంబములవారు ఈ శ్లోకములను, మరణావస్థలోనున్నవారి చెవులలో వల్లించుట వాడుక. కాని వారిలో, దీనియందలి భావముగాని, సత్యవిశేషముగాని తెలిసినవారు చాల స్వల్ప సంఖ్యాకులుగానుండిగలరు.

మొట్టమొదటి ఉపనిషదునందే మూడు శ్లోకములు ప్రార్థనకొరకు ప్రత్యేకించబడియున్నవి. అనగా, వేదాంతము భక్తికి విరోధమని తలచువారి వెఱ్ఱితనము ఎంత గొప్పదని చెప్పగును. ఉపనిషదు కర్తలు, సాకార బ్రహ్మ ఉపాసనకు ఏమాత్రము విరోధభావముగల వారు కారనుటకు ఈ మూడు శ్లోకములు సన్నిహిత సాక్ష్యముగానున్నవి.

వేదకాలమునందు, పురాణకాలదేవతలు లేరు. వీరింతయు వెనకటి కాలమున హిందూవాఙ్మయమున సృష్టింపబడినవారు. కనుక ఈ ఉపనిషదునందు సూర్యభగవానునిగూర్చి ప్రార్థన జరుగుచున్నది. ఆర్యుల ఉన్నత జ్ఞానమున, సూర్యుడు, ఈ బ్రహ్మాండమునకు, నియామకుడు, సంరక్షకుడు, వినాశకారుడుగా నున్నట్లు స్పష్టముగా తెలియుచుండెను. నవీన కాలమున, ప్రకృతి శాస్త్రజ్ఞాన సహాయమున, ఇట్టి వేదకాలపు నమ్మకము సమ్మతింప తగినదియని సులభముగా తెలియుచున్నది. సూర్యుడులేని బ్రహ్మాండము, తలుప సాధ్యముగ లేదు. ఈ గ్రహరాసుల యందు జీవితము, సూర్యునిశక్తి, బలములేనిది అసాధ్యముగా నుండగలదు.

మరియు, ఇట్టి ప్రార్థనను, కేవలము హృదయ వేదనను వెలిపుచ్చుట యని మాత్రము తలచుటవల్ల ఋషుల పరమ జ్ఞానమును చులకనగా చూచినటు కాగలదు. ఇందు, వేదాంత విచారులకు, గంభీర అర్థ పూరిత ప్రాముఖ్యత ఇమిడియున్నది. ఈ మంత్రములను ఒక్కొక్కటిగా పరీక్షించుచు కొలది అందు దాగియున్న రత్నములను చూడగలము.

సత్యారాధకులు, ఈ మూడు శ్లోకములను కంఠస్థము చేసుకొని, అర్థముతో పాటు వాటిని పల్లించగలుగుట స్వార్థరహిత అన్వేషకులకు దివ్యప్రార్థనగా నుండగలదు.

హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాభి
హితం ముఖమ్ ।
తత్త్వం పూషన్నపావృణు సత్య
ధర్మాయ దృష్టయే ॥ ౧౫ ॥

సత్యస్వరూపుని ముఖము స్వర్ణపాత్రముచే కప్పబడియున్నది. ఓ సూర్యభగవానుడా! ఆ మూతను నాకొఱకు తొలగించుము. నేను సత్యాన్వేషణ పరుడను. నేను చూడగోరుచున్నాను.

ఇది బాహ్యమున, సత్యస్వరూపమును మరుగుపరచు తెరను తొలగించుటకై తగుశక్తి పొందుటకు సూర్యభగవానుని వేడుకొను ప్రార్థనవలె తెలియుచున్నది. ఇది మరణశయ్యపై పరుండి, మరణించ సిద్ధముగానున్న మానవుని ప్రార్థన.

ఇందలి వాచ్యార్థమును మాత్రము గమనించుటలో ఈ ప్రార్థనయందలి బాహ్య సౌందర్యమును మాత్రము తెలియగలము. నిజముగా ఇందులో వెదకను, వెదకను ఇందలి అమూల్య ధనకోశమును కనుగొనగలము.

వేదాంతమున ప్రార్థన యనగా, మానవుని అహంకారము పరమాత్మతో ఐక్యము పొందుటకుచేయు ప్రయత్నము. ఆ పరమాత్మ నుద్దేశించి అహంకారము, ఈ మంత్రమును పల్లించుచున్నది. ఇందు సూర్యభగవానునిగూర్చి ఉపయోగించబడిన విశేష పదములు చాల నిపుణముతో ఏర్పరుపబడియున్నది. పూషన్ అనునది సూర్యునికిగల అనేక పేర్లలో యొకటి అనగా సంరక్షించువాడని అర్థము. సూర్యుడు ఈ బ్రహ్మాండమునకంతయు మధ్యనున్నాడు. అతడు చలించుటలేదు. వ్యవహరించుటలేదు. కాని, తన యొక్క నిలకడవల్లనే, తన చుట్టునున్న బ్రహ్మాండమునగల సంచారములకంతయు సమతూనిక కలిగించుచున్నాడు. ఈ బ్రహ్మాండమునకంతయు శక్తిప్రదాత సంరక్షకుడుగానుండుటవల్ల, అతడు సాధకుని, ఆంతర ప్రపంచమునగల జ్యోతి స్వరూపుడు. సంరక్షకుడు అగు ఆత్మకు సరిపోల్పదగియున్నాడు. ఈ చలనము లేని మధ్య బిందువు శక్తికి మూలాధారమై, శక్తి సంచార ఆవరణమునంతయు, చుట్టువ్యాప్తమైయుండు

ప్రకృతి విషయములనంతయు, ఈ తేజస్సు ఆత్మ, నియమింపగలిగియున్నది. అహంకారము, తన నిజ స్వరూపము ఆత్మయని తెలుసుకొనినతోడనే మరణము గాంచుచున్నది. కనుక ఇది న్యాయముగా, మరణావస్థయందున్న మానవుడు చేయగల కడపటి ప్రార్థనగాయున్నది. ఇచ్చట మానవుడు అనగా, అహంకారమని తెలియవలెను. ఇది నిజముగా మరణించు ముసలివాడు చేయగల ప్రార్థనయని అర్థము చేసుకొనకూడదు. ఇది దివ్య సాధకుడు తీవ్రసాధనలతో ధ్యానపీఠమున కూర్చుని, పుణ్య ప్రయత్నములతో, తనయందు ఆత్మను అహంకారలేశమును దాగియుండకూడ పట్టుదలతో తొలగించుకొనుటకు చేయు, కడపటి ప్రార్థనగానున్నది.

మనోబుద్ధులతో వ్యాప్తిజెందిన అహంకార ఎరుక, తనకు ఆధారముగా వెనుకయుండు శుద్ధ (ఆత్మ) ఎరుకను తెలుసుకొని సమీపించగల ప్రయత్నమున, ఆత్మయొక్క ప్రకాశము వైభవమువల్ల కన్నులు మూతలు పడిపోవుచున్నవి. కనుక ఆ శుద్ధజ్ఞాన స్వరూపమును, తన ముసుగును తొలగించమని వేడుకొనుచున్నది. మనసు, బుద్ధులు బాహ్యదృష్టి పొందినపుడు, నామ రూపములతో కూడిన విషయ ప్రపంచమును మాత్రము దర్శింపగలిగియున్నవి. ఈ దృశ్యములో మగ్నమయినపుడు ఈ అహంకారము తనకు అంతరమునయున్న సత్య స్వరూపుని దర్శించజాలదు. ఇట్లు ఈ బాహ్య విషయ ప్రపంచము, అందు అంతరమునయున్న సత్యమును కప్పుచుండు తళతళలాడు, ప్రకాశవంతమైన బంగారు మూతవలె నుంటున్నది. సత్యస్వరూపుని ఆలయద్వారమున సాధకుడు నిలువబడి తలుపులు తట్టి, లోపలయున్న సంరక్షకుని (పూషన్) విషయ పూరిత తలుపులను తెరచి, తనయొక్క దివ్య స్వరూపమును దర్శనమీయవలెనని కోరుచున్నాడు.

సాధకుడు, పరమాత్మయొక్క దర్శనము పొందుటకుగల అధికారమేమియనిన, ఇందు తెలుపబడుచున్నది. అతడు స్వయముగా సత్యమార్గావలంభి కనుకనే సత్యస్వరూపుడు అతనికి ప్రత్యక్షమగుట ఆవశ్యకమని తెలుపుచున్నాడు.

ఇది చాల ముఖ్యమయిన విషయము. ఎందుకనన ఇచ్చట, సాధకుని గమ్యస్థానము, సత్యము, అతని మార్గము సత్యము. అతడు సత్యమును చేరగల దూరమంతయు అడుగడుగును, సత్యంమీద ఆధారపడియున్నది. మరి ధర్మమున, గమ్యస్థానమునకుగల విలువమార్గమునకుకూడ ఆవశ్యకముగనున్నది. మోసము, మృగత్వము వల్ల, జన్మరాహిత్యము పొందుటకాని, అభివృద్ధికాని, శాంతిగాని, పరిపూర్ణ ప్రాప్తిగాని సిద్ధించదు.

పూషన్నేకర్షే యమ సూర్య ప్రాజా
పత్యవ్యూహ
రశ్మీన్సమూహ। తేజో యత్తే రూపం
కల్యాణతమం
తత్తే పశ్యామి యోఽసావసౌ పురుషః
సోఽహమస్మి ॥౧౬॥

ఓ పూషా! (సూర్య - సంరక్షకా!) ఓ సర్వద్రష్టా! ఓ సర్వనియామక! సూర్య! ప్రజాపతి పుత్రుడా! నీకిరణములను తొలగించి, నీ ప్రజ్వలిక తేజమును ఉపసంహరింపుము. నీ దివ్యరూపమును చూడగలుగుచున్నాను. నీలోనున్న పురుషుడు నేనే!

ఇచ్చట మరణదశపొందిన అహంకారము ఎవరిని చూచి మొరపెట్టుకొనుచున్నదో, సూర్య భగవానునివైపు ప్రయోగించిన కీర్తివాక్యములవల్ల ఋషుల భావము ప్రకటితమగుచున్నది. సూర్య భగవానునివైపు ఉపయోగింపబడిన గుణవర్ణనపదములవల్ల, ప్రార్థనయందుగల వేదాంత విశేషము తెలుపబడకయే విశదమగుచున్నది. ఇవన్నియు ఆత్మపరము చక్కగ అన్వయమగుచున్నది. సంరక్షకుడు, సర్వభర్త, సర్వనియామకుడు, ఇవన్నియు మానవుని హృదయాంతరాళవాసునివైపు చక్కగ అన్వయింపగలిగియున్నవి. ఈ ప్రార్థరీత్యా, ప్రార్థించు అహంకారము, ధ్యానకాలమున, మనసుబుద్ధి రెండును పూర్తిగ అంతరాత్మయందు లీనమై, సత్యస్వరూపుని, ఆత్మానుభవముగ సందర్శించుచున్నవి.

ఆత్మ దృశ్యముకు సాధ్యముకాదు. స్పర్శచే తెలియబడదు. బుద్ధిచే గ్రహింపబడదు. సన్నిహిత స్వానుభవమువల్లనే అనుభవింపనగును, అను భావము ఇచట. "నీలోనున్న పురుషుడు నేనే" అనువాక్యముతో విశదీకరింపబడుచున్నది. ఈ వాక్యము ఆత్మసాక్షాత్కార సమయమున ఆత్మవేత్తలు తెలుపు వాక్యములు కావు. కాలాంతరము, వారు మరల మనోబుద్ధుల ఆవరణముతోకూడిన ప్రపంచమున మేలుకొనిన వెనుక, తన అజ్ఞానదశలో ఈ శరీరమే తాను అనుకొనిన అభిప్రాయము పొరపాటు తాను ఈ దేహముకాదు. ఇప్పుడు జ్ఞానోదయమయిన వెనుక, తను శుద్ధ ఎరుక. జ్ఞానస్వరూపముగాక వేరుకాదు. "నీలోనున్న పురుషుడ నేనేను" అని పలుకుచున్నాడు.

బ్రహ్మ నెరిగిన మహనీయుడు బ్రహ్మయగుచున్నాడు అనుపలుకులు పలుమారు ఉపనిషదులందు పునరుచ్చారణము కాంచుచుండును. మానవుడు భగవంతుని చూడజాలడు. కాని భగవంతుడు అనుభవమునకు అతీతుడగు అభావము గాదు. దైవత్వము జీవింపదగిన అనుభవింపతగిన, నమ్మకపదవి కాని, ఈ కార్యము మానవునివల్లకాదు. దైవమువల్లనే సాధ్యకము ఆత్మానుభవము పొందిన మానవుడు మానవుడని అటుపిమ్మట చెప్పదగడు. అతడు భూమిపైన దైవమే తాత్కాలికముగా మానవ కృతితో మెలగుచుండును. అహంకారము నశించిన చోట, దివ్యదర్శనము పరిపూర్ణ ప్రకాశముతో ప్రకటితమగును.

తన స్వరూపము నెరిగిన అల, సముద్ర స్వరూపమును అనుభవించును. భూతము తనస్వరూపము తెలుసుకొని స్తంభముగానుండును. దైవత్వమును అనుభవించుమానవుడు తానే అమరదైవమగుచున్నాడు.

(సశేషము)

# తిరుపతి యూనివర్సిటీలో నాటకకళకు ప్రోత్సాహము

పద్మశ్రీ స్థానం నరసింహారావుగారి సన్మాన సభలో ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ గోపాల రెడ్డిగారు తిరుపతి యూనివర్సిటీలో నాటకకళ తగు ప్రోత్సాహమివ్వబడగలదని సూచించారు.

నాటక కళకు ప్రోత్సాహమంటే ఉత్తమనాటకాల రచనకు, ప్రదర్శనకు శిక్షణ నివ్వడము.

ఉత్తమ నాటకాల ప్రదర్శనద్వారా ప్రజలలో విజ్ఞాన వినోదాలతోబాటు సంగీత సాహిత్యాలపట్ల ప్రజలలో ఆసక్తి పెరుగగలదు.

మానవుని మనస్తత్వం పై దృశ్య కావ్యాలకుగల ప్రభావం అమోఘమైనది. దానిని అనుకూల వాతావరణంలో వినియోగించుకోడానికి తిరుపతి యూనివర్సిటీ నాటకకళను ప్రోత్సహించనుండటం సంతోషింపవలసిన విషయము.

# సామెతలు

శ్రీ వి. జి. వి. నరసింహారావు

1. "రూకలేనివాడు పోకచెయ్యడు."
2. "మాటకుమాట తెగులు; నీటికి నాచు తెగులు."
3. "బ్రహ్మకైనపుట్టు రిమ్మతెగులు."
4. "కాగలపనులెల్ల కాకమానవు. కాని పనులు భువిని కానేకావు"
5. "గడుసురాలు మగని గంపబెట్టమ్మురా."
6. "ప్రాప్తిగలుగుచోట ఫలమేలతప్పు."
7. "చిన్నపామునైనను పెద్ద కర్రతో కొట్టవలెను."
8. "పరమ మిత్రుడున్న బంధువులెందుకు."
9. "వాసిరెడ్డి వెంకటాద్రి తులాంటాద్రి తులాభారము తూగితే కరెడ్ల కామమ్మ వంకాయల భారము తూగిందంట."
10. "పోరానిచోట్లకుపోతే రారాని మాటలు రాకమానవు."
11. "ఇల్లు ఇరకటము; ఇల్లాలు మర్కటము."
12. "శుభం పలకరా యెంకన్నా అంటే పెళ్ళికూతురు ముండేది అన్నాడట."
13. "బొంకరా బొంకరా పోలిగా అంటే టంగుటూరి మిరియాలు తాటికాయలంతేసి."
14. "ఎద్దేమిఎరుగురా అటుకులరుచి; గాడిదేమి యెరుగురా గంధపు పొడివాసన."
15. "పేరు గంగానమ్మ త్రాగబోతే నీళ్లులేవు."
16. "భార్య మాటలువిని అన్నదమ్ములబాసి వేరుపడెడివాడు వెర్రివాడు."

# 'రాగమయి'

### శ్రీ విజయ - రాఘవ



రఘునాథం క్రొత్తగా వుద్యోగంలో చేరాడు. పనిమీద శ్రద్ధ చూపకుండా యెప్పుడూ యేదో ఒక విషయాన్ని గురించి ఆలోచిస్తూ వుండేవాడు. రాజీనామా యిచ్చి యింటికి పోయి, వున్న పాతికెకరాల భూమిని సాగు చేసుకొందామనుకొనేవాడు. కాని "ఉద్యోగం పురుషలక్షణం" అన్న సామెత జ్ఞాపకం వచ్చేది. ఎంతో డబ్బు తగలేసి బి. ఎ. వరకు చదివినందుకు నాలుగు కాలాల పాటు వుద్యోగం చేద్దామనిపించబట్టే వచ్చి చేరాడు. మనస్సెందుకో స్వగ్రామం మీదికి పోతూండేది. సరిగ్గా అన్నం తినబుద్ధి అయ్యేది కాదు. రాగమయి దగ్గరనుండి కనీసం వుత్తరం వస్తుందేమోనని పరిపరి విధాలుగా పడిగాపులు పడ్డాడు. ఎన్నాళ్లు చూచినా, కళ్లు కాయలు కాసినా, మూడు కాన్ల కార్డుముక్క కూడా రాకుండా పోవడం వల్ల ఆరోజు కారోజు ఆశ్చర్యం ద్విగుణీకృతమవసాగింది. రఘునాథమే సాహసించి ఒక వుత్తరం వ్రాద్దామనుకొన్నాడు. కాని మనస్సొప్పలేదు. "చేస్తానన్న సహాయం చేయలేకపోయాను సమయానికి" అన్న దుఃఖ ఆనాటి కానాడు యెక్కువ అవసాగింది. 'రాగమయిని' "పాపా" అని పిల్చినప్పుడు తనేదో శృంగార నాయకుడిలాగా భావించుకొనేవాడు. రాగమయిని వివాహం చేసుకోవాలని రఘునాథానికి మనస్ఫూర్తిగా వున్నమాట నిజమే. కాని బంధువులంతా యీ సంబంధం చూసి అయిష్టత వెళ్లబుచ్చారు. కారణం యేమిటీ? అతను పెద్దగా ఆలోచించలేదు. అనవసరమనిపించేది. సుందరమ్మ సంసారాన్ని చేతీసాడని, అసలిదంతా వాడు చెడిపోవడానికి కాలం సమీపించిందని, మేనమామ వెంకట్రావు భాగ్యతో అంటూండేనాడు. నాల్గు, అయిదుసార్లు వుత్తరాలుకూడా వ్రాశాడు. రఘునాథునికి — యీ విషయాన్ని పురస్కరించుకొని. కాని రఘునాథం ఆ వుత్తరాలు చదివి యేమీ జవాబులు యివ్వలేదు. రాగమయి యెన్నోసార్లు స్వప్నాల్లోకనిపిస్తూ జ్ఞాపకానికి తెచ్చుకొందామన్నా రానటువంటి స్వర్గసుఖాలను చవిచూపిస్తూండేది. ఆకల కరిగి పోకుండా ఎప్పుడూ అలావుంటే బాగుండుననిపించేది రఘునాథానికి. రాగమయి సౌందర్యంలో అంతులేనట్టి స్వర్గసుఖాల్ని, ఎంచలేనటువంటి జీవిత పరమావధిని అనుభవించగలననే ధైర్యం వుంటూ వుండేది.

రాగమయిని 'పాపా' అని పిల్చుకున్ననాడు తృప్తిగా వుండేది మనస్సు. శ్యామసుందరికి రాగమయికి చదువుకునేందుకు తానే ధనసహాయం చేసి వున్నాడు. శ్యామసుందరి తనకన్న రెండేళ్ల పెద్దకాబట్టి అంతగా పరిచయం వుండేది కాదు. రాగమయి మీద రఘునాథానికి సర్వవిధాల అధికారంవుంది. అంతమాత్రానికి అవినీతిగా ప్రవర్తించలేదు. అతనిలో సభ్యత చాల గౌరవప్రదమైనటువంటిది. ఏదెంత వరకు వుండాలో అంతవరకే వుంచగలడు. రాగమయితో అతనికున్న పరిచయమే యీనాడు అతన్ని వుద్యోగం చేసుకోనివ్వడంలేదు. అయినా తప్పదు. అందుకనే తలవంచి, చేస్తూండక తప్పింది గాదు. ఒకప్రక్క రాగమయి సంస్మరణ మరోప్రక్క వుద్యోగం రభస అతన్ని ఉక్కిరి బిక్కిరి చేయసాగాయి.

## 2

కుటుంబరావుకి రఘునాథం దత్తతగా వచ్చిన కుమారుడు. వచ్చిన రెండు కాన్పులకు ఆడపిల్లలే కల్గటంవల్ల, తన వంశగౌరవాలు నిలబెట్టేందుకు మొగపిల్లలనుకనే భాగ్యం తనకు లేదేమో అని పరిపరి విధాలుగా పరితపించింది సుందరమ్మ. రఘునాథం

(385-వ పేజి చూడుడు)

# చీ క టి మ లు పు

శ్రీ చింతలపూడి వెంకటేశ్వరరావు



బయటనుంచి నిస్పృహ చెందుతూవచ్చిన వెంకట్రావు, మడతమంచంవాల్చి, గోడకు ఆనుకొని కూర్చున్నాడు. ఎదురుగుండావున్న కిటికీవైపు చూస్తున్నాడు. నక్షత్రాలు లేని నల్లని ఆకాశం కన్పిస్తుంది. కిటికీ తలుపులు గాలికి టపటపా కొట్టుకుంటున్నాయి. ఇనపవూచకు వ్రేలాడుతున్న దీపం భగ్గుమనిమండి, హటాత్తుగా ఆరిపోయింది. గదంతా చీకటిమయం. ఆరిపోయిన దీపం గురించి వెంకట్రావుకి పట్టినట్లు లేదు. కూర్చున్న వాడు కూర్చున్నట్లే వుండిపోయాడు. వంటింట్లోనుంచి వచ్చిన సుగుణ, ఆరిపోయిన దీపం వెలిగించింది. మంచంమీదవున్న వెంకట్రావును చూచి, కొంచెం ఆశ్చర్యపడింది. అతనిదృష్టి, వేటినో సమాధానం వెతుక్కుంటున్నట్లు, అతనికళ్ళే చెపుతున్నాయి.

"అన్నయ్యా! ఎంతసేపయిందివచ్చి" అనిప్రక్కగా నిలబడి అతనివంక చూస్తోంది. సమాధానం లేదు. ఈ సారి కొంచెం గట్టిగాఅంది. అతడు వులిక్కిపడి, ముందుకు వంగిచూశాడు. అతనివేపుకి నివ్వెరబోతూ చూస్తూన్న సుగుణనుచూచి, ఎందుకో నవ్వుకున్నాడు. ఆమెకూడ నవ్వింది. ఇద్దరి హాసచంద్రికలకు, బహుశా సమాధానం వేరుకావచ్చును. కాని ఆమె ఎందుకు నవ్వింది, అతడు అడగలేకపోయాడు. అతడు ఎందుకు నవ్వుకుంది అర్థంచేసుకోడానికి ప్రయత్నం చేశాడు. కొన్ని క్షణాలు గడచిన తర్వాత, "చెల్లి! అమ్మను ఒకసారి పిలు" అని అడిగాడు.

"అమ్మ ఇంట్లోలేదు." ఇంకా ఏమో అనబోయింది. నాలుక చివరవరకు వచ్చిన మాటలు బైటికిరా లేకపోయినవి. నాలుక కొరుక్కుంది. అక్కడవుంటే, వెళ్ళిన వివరాలు అడుగుతాడని, అచ్చటనుంచి కదిలింది. ఆమె వెళ్లుతున్నవైపుచూచి "ఎక్కడికి వెళ్ళింది?" ఆమెకు విన్పించేటట్లు అన్నాడు. వెనక్కి తిరిగి చూచింది. ఆమె విశాల నయనాలలో భయపడుతున్న ఛాయలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. మళ్లా మొదటి ప్రశ్నే వేశాడు. ఇప్పుడు అతడు అడిగినప్పుడు చెప్పకుండావుండలేకపోయింది.

"కుటుంబరావుగారింటికి వెళ్లింది ..." అచ్చట నిలబడలేదు. తలవంచుకొని, లోపలికి వెళ్లిపోయింది. ఆమె కన్పించేవరకు చూస్తున్న అతనికి, గోడమీద ప్రాకుతున్నబల్లి కన్పించింది. దీపం కాంతివంతంగా వెలుగుతోంది. కిటికీ తలుపులు గాలికి యింకా కదులుతు నేవున్నాయి. మంచంమీదనుంచిలేచి, కిటికీ తలుపులువేశాడు. ప్రశాంతంగావుంది వాతావరణం, బల్లి గోడమీద కదులుతోంది. పురుగులు గాలిలో అక్కడక్కడ ఎగురుతున్నాయి. చేతులు వెనక్కి పెట్టి, అటూ ఇటూ పచార్లుచేస్తున్నాడు. "ఎందుకు వెళ్ళినట్లు?" తనలో వేసుకున్న ప్రశ్నకు జవాబు లేదు. "ఎందుకు సమాధానంరాదు?" అనుకున్న పర్యవసానం మొదటి ప్రతిఫలమే.

దీపంమీద వాలిన పురుగు కాలిపోయింది. మాడి మసై నేలమీద రాలిపోయింది. దీపం అందంగా వుందని, తనకు ఆహ్వానం అందిస్తుందని, ఆనందించి దానిమీద వ్రాలింది. అందంగావున్న ఆదరణ, తన ప్రాణాన్ని తీసింది; బూడిదిగాచేసింది. గోడమీద బల్లి చూస్తోంది. బల్లి నవ్వుతున్నట్లు అనుకుంటున్నాడు. దీపంతీసి, నేలకేసి కొట్టాలనిపించింది. ఒకరికి వెలుతురు, మరొకరికి చీకటినిచ్చే దీపంమీద జాలివేసింది. గోడమీదపడుతున్న పురుగుల్ని పట్టుకొని, కడుపులో వేసుకుంటున్నబల్లి, అతన్నిచూచి వెక్కిరిస్తోంది.

"అది బల్లికాదు, కుటుంబరావు." అతడు అరవాలనుకున్నాడు. హృదయంతో బలం సన్న

గిలింది. ఆందోళన అధికమైపోయింది. ఉద్రిక్త పరచిన వాతావరణం, అతన్ని వెర్రెత్తిస్తోంది. రెండు పట్టాలమధ్య రైలు పరుగెడుతోంది, కుటుంబరావు వికృతంగా నవ్వుతున్నాడు. వేగంగా వెళ్లిపోతూన్న రైలు అకస్మాత్తుగా ఆగిపోయింది. ఎవరో రైలు క్రింద పడిపోయారని, ప్రయాణీకులు క్రిందకి దిగుతున్నారు. కుటుంబరావు దిగలేదు. ఇంకా నవ్వుతూనేవున్నాడు. వెంకట్రావు త్రుళ్లిపడి దీపంవైపు చూశాడు. రైలూలేదు, ఏమిలేదు. అతని మనస్సులో ఆందోళనతప్ప, కుటుంబరావులాంటి మనుష్యులంటే అతనికి అసహ్యం. భూమిమీద అటువంటి వాళ్లు వుండటమే అతనికి ఏవగింపు. భగవంతుడు అటువంటి మనుష్యులను ఎందుకు సృష్టిస్తాడు? అతనెందుకు వేసుకోవాలిప్రశ్న? కుటుంబరావు అతన్ని ఏంచేశాడు? వెలుతురులో కత్తి తళతళా మెరసిపోతోంది. నల్లని ముసుగు, కళ్ల క్రిందవరకు కప్పుకున్న వ్యక్తి, తన వేపుకి వస్తున్నాడు. వెంకట్రావు ముఖంనిండా ముచ్చెమటలుపోశాయి. గుండె వేగంగా కొట్టుకుంటూంది. చంపుతాడా కొంపదీసి? ఊహుఁ ... "నరుకుతాడు, కత్తితో ఒక్కపోటు...గుండెలో ... నెత్తురు 'జీయ్'మని పైకిలేస్తుంది." నల్లనితెర ముందుకు ... చాల దగ్గరగా వచ్చేస్తోంది. కాళ్లు వణికిపోతున్నాయి, వళ్ళంతా తడిసిపోయింది. కత్తి పదునుగావుంది, మంచి అదను, ఎవరూలేరు, అరిస్తే, రక్షిస్తారేమో? ... నోరు తెరవబోయాడు. కత్తిమొన గుండెకు దగ్గరగా వచ్చేసింది. నాలుక పిడచ కట్టుకుపోయింది.

"నన్ను చంపవద్దు, నా దగ్గర ఏముందని చంపుతావు." అతడు మాత్రం అనలేదు. అని వుంటాడని అనుకున్నాడు.

"నీదగ్గర నాకు కావలసింది చాలావుంది." నల్లని ముసుగులోంచి బెదరింపు.

"డబ్బులేదు, దారిద్ర్యంవుంది." అధైర్యపడుతూ.

"నీ డబ్బు, దారిద్ర్యంవొద్దు, వీటికంటె విలువైన వస్తువు నీ దగ్గరవుంది."

"నా ప్రాణం ... అంతేనా?" బలవంతంగా తెచ్చుకున్ననవ్వు, కత్తివేపు చూచింది. కత్తికి జాలివేయలేదు. ప్రాణంమీద సవారి చేస్తోంది.

"నీ ప్రాణంకాదు, నువ్వుకాదు."

"అయితే నా దగ్గర యింకేమిలేదు."

"అది నీకు తెలియదు. ఈ కత్తి చేతులో వున్నవానికితప్ప, యింకెవరికికూడ తెలియదు."

"నీకు కావలసింది తీసుకో!"

"నీవే యివ్వాలి!"

"చెప్పితే, ఆ విధముగానే యిస్తాను."

"నీ సౌశీల్యం, సహృదయం కావాలి. డబ్బు యిచ్చి కొనుక్కుందామంటే అవి లభ్యంకావని దీన్ని వుపయోగించవలసివచ్చింది." అతనికేమి అర్థం కాలేదు. కత్తిమీద వల్లమాలిన జాలివేసింది.

"సాధించు." కళ్ళుమూసుకున్నాడు. శరీరం గజగజవణికిపోయింది. చీకటి మాత్రం కన్పిస్తోంది.

అన్నయ్యా, అమ్మా! సుగుణ మాటలు విన్పించేసరికి, ఉలిక్కిపడి, కళ్ళు నలుపుకుంటూ చూశాడు.

నల్లని ముసుగు కన్పించలేదు. గుండెమీద చూచుకున్నాడు. కత్తిలేదు. వెలుగుతున్న దీపం, గోడ మీద బల్లి వాటి పనులు అవి నిర్విరామంగా చేసుకుపోతున్నాయి. ముసుగుతోవున్న మనిషి ఎవరు? కుటుంబరావుకాని కాదుగదా! ఎందుకు మాయమయ్యేడు. అయితే కలా! కళ్ళు తెరిచివుండి కలయేమిటి? పిచ్చిగాని, ఎవరైనావింటే నవ్విపోతారు. నిజంగా జరిగితే, తను ఇంకా బ్రతికే వున్నాడు. అతడెందుకు "అది" అడిగాడు. వాటి వల్ల అతనికి ఉపయోగం? చాల విచిత్రంగా వుంది, రైలు రైలు పట్టాలు, నల్లని ముసుగు, పదును కత్తి, ఇవన్ని అతని ఆలోచనలకు ఆకారాలు, అంతే!

రిక్షావాడికి డబ్బులుయిచ్చి, వీధి గుమ్మంనుంచి వస్తూన్న 'సుభద్రమ్మ' వెంకట్రావునిచూచి, నిల బడింది. అతడు మంచంమీదవచ్చి కూర్చున్నాడు. దీపంవత్తి కాస్త పెద్దదిగాచేసి, సుబద్రమ్మ, మంచం మీద అతనికి కొంచెం దూరంగా కూర్చుంది. సుగుణ గుమ్మానికి ఆనుకొని నిలబడింది. చాల సేపటివరకు, ఎవరు ఏమిమాట్లాడుకోలేదు. తాను వెళ్ళినపని చెప్పడానికి ప్రయత్నంచేసి, చెప్పలేకపోతూంది సుబద్రమ్మ. "ఎందుకు వెళ్ళినట్లు ?" తను వేసు కున్న ప్రశ్నకు సమాధానం ఈ సారి వస్తుందని తెలి సుండికూడ, మాట్లాడకుండా మౌనంగా వూరు కున్నాడు వెంకట్రావు. ఎవరు ఏమిమాట్లాడకుండా కూర్చోవడం రుచించలేదు సుగుణకు.

"అన్నయ్యా! చాల సేపయింది. భోజనానికిలే" అంది. సుబద్రమ్మ కళ్లుచేసుకొని, "ఇంకా భోజనం చేయలేదా - భోజనానికిలే" కుమారునివైపు చూస్తూ అంది.

"కుటుంబరావు ఏమన్నాడు ?" కొంచెం కటు వుగా అడిగాడు, భోజనం విషయం విస్మరిస్తూ.

"నేనూ అదే చెప్పాలని అనుకుంటున్నాను. చెప్పిన తర్వాత నీవు బాధపడతావని, వెనుకాడు తున్నాను." కొంచెం వెనుకాడింది. అతడేమి తిరిగి సమాధానం యివ్వలేదు. చెప్పమన్నట్లు తలవూపాడు.

"కుటుంబరావుగారు చాల మంచివారు ?"

"అవును, చాల మంచివారు ..."

"అతని విషయం నీకుకూడ అర్థమయిందిగా;"

"బాగా అర్థమయింది. అతని మనస్సు తేనె వూసినకత్తి, హృదయం పయోముఖ విషకుంభం."

సుబద్రమ్మ తెల్లబోయింది. సుగుణ వింతగా వింటోంది.

"అతని సంగతి తెలుసుండికూడ, కుటుంబరావు ఇంటికి ఎందుకు వెళ్ళినట్లు ?"

"నీ గురించి వెళ్ళాను, కావలసినవాళ్ళకు దూర మయిన, మన కష్టసుఖాలను తెలుసుకుంటున్నారు కాబట్టి, వెళ్లక తప్పిందికాదు."

"అతడు మనకు చేసిన అన్యాయం మఱచిపోయా ననుకుంటాను. మన సాధక బాధలను తెలుసుకుంటు న్నాడని అనుకుంటున్నావు. అతడు మనకు సహాయం చేస్తాడని ఆశపడుతున్నావు. మన విషయంలో అతడు చేయబోయే ప్రతి ప్రయత్నం మన జీవితాలను హతమార్చడానికని గ్రహించవలసి ఉంటుంది."

"ఎవరో గిట్టనివాళ్లు చెప్పినమాటవిని ... నాకు నమ్మకంవుంది - అతడు చాల మంచివాడు ... లోకం కూడా అంటుందిగా !"

"సరి, అయితే ఏమన్నాడు ?"

"నీ చదువుకోసం సహాయంచేయమని అడిగాను. వందరూపాయలు అప్పు అడిగాను. ఇస్తానని చెప్పాడు. కాని ఒక్క షరతు పెట్టాడు. వాళ్లమ్మా యిని నీవు చేసుకుంటే, తప్పకుండా చేతనయినంతా సహాయంచేస్తానన్నాడు. చదువు చెప్పిస్తాడు, మంచి ఉద్యోగం ఇప్పిస్తాడు."

వెంకట్రావుకి వళ్లు కంపరమెత్తింది. అనుకున్నంత పనిచేశాడు. మంచి పథకంవేశాడు. పన్నాగం బాగుంది. బంగారు సంకెళ్ళు.

"అందుకు అంగీకరించావా అమ్మా ?" వెంక ట్రావు లేచినిలబడ్డాడు.

"నీతో సంప్రదించేవరకు మాట యివ్వనన్నాను."

"అయితే నీవు అడిగిన డబ్బు యిచ్చాడా ?"

ఆమె వట్టిచేతులు చెపుతున్నాయి లేదని, ఆమె సమాధానం చెప్పలేదు.

"ఇప్పుడైనా గ్రహించావా - అతని మనస్సు ఎటువంటిదో ?" కోర్టులో లాయరు చెప్పినట్లు చెప్పాడు.

"స్వలాభంలేనిది సహాయంచేయడానికి ఎవరు సాహసించరు. అది సహజం," సుబద్రమ్మ కుటుంబ రావు తరుఫున వాదిస్తోంది.

"అతడు స్వలాభంకోసం ప్రాకులాడుటలేదు. స్వార్థంకోసం ఈ ప్రయత్నమంతా చేస్తున్నాడు. సహాయం చేస్తున్నానని పేరుచెప్పి, స్వార్థానికి బదులు త్యాగం అనే పదం వుపయోగించి, త్యాగ పురుషుడనిపించుకోవాలని చూస్తున్నాడు. అతని సహాయంవొద్దు, అతని ఆదరణవొద్దు."

"పరిస్థితులు ప్రతికూలంగావున్నప్పుడు, యితరుల మీద ఆధారపడాలి. లేకపోయినట్లయితే, మన జీవితాలింతే!"

"అమ్మా! నీవన్నది కాదనడంలేదు. కాని, కుటుంబరావు విషయంలో నా మనస్సు అంగీకరించదు."

"పోనీ, మీ మామయ్యను వెళ్లి అడుగు. గతించిన విషయాలన్ని మఱచిపోగల్గితే-సహాయంచేగయలడు."

"మామయ్యను యాచించి బ్రతకడంకంటె, అడుక్కొని తినడంలో ఆనందంవుంది. తమ్ముడనే అభిమానంకొద్దీ, అచ్చటకు వెళ్లమంటున్నావుగాని, అతనికి నీపైవున్న అనురాగం ఎటువంటిదో తెలుసుకోగల్గావా?"

"అన్ని రోజులు ఒకలాగవుండవు. పాతరోజులను వాడెప్పుడో మరచిపోయివుంటాడు. మనమీద వారికి అభిమానంవుంటుంది?"

"మామయ్యను మంచిగా అర్థంచేసుకున్న నాన్న జీవితాన్ని నిలువునా నాశనంచేశాడు. మనం ఈ విషయాన్నికప్పినా ప్రపంచం నోరును కప్పలేము."

"దుర్మార్గులుగా ఎప్పుడూ ఎవరూ ఉండిపోరు. వారిలో హృదయ దౌర్భల్యం స్థిరంగా నిలిచిపోదు. మానవుడు ఎప్పటికైనా మంచి వాడవకుండా మానడు."

"అది ఎవరి విషయంలోనైనా జరుగుతుందిగాని, మామయ్య విషయంలో జరగదు."

"ఇంకా నీది చిన్నవయస్సు. ప్రపంచంలో విషయాలు అర్థంచేసుకోలేకుండా ఉన్నావు. ఒకరి మీద ఆధారపడటమంటే మీ నాన్నకు సుతరామూ ఇష్టముండేదికాదు. చనిపోయేవరకు స్వతంత్రంగా బ్రతికారు. వారు స్వతంత్రంగా బ్రతికి మనకు ఒలకపోసింది, నిరాధారులుగా వదిలిపెట్టడమే. ఇప్పుడు మనం స్వతంత్రులంకాదు. పరిస్థితులకు బానిసలం. కాలంచేతిలో కీలు బొమ్మలం మరి యొకరి అభిమానం మీద ఆధారపడవలసిన వాళ్లం."

"నాన్నలాగ మనం ఎందుకు బ్రతకలేం!"

"మీ తాతగారు వదిలిపెట్టివెళ్లినఆస్థి, మీ నాన్నగారు వదలిపెట్టివెళ్లితే, నీవనుకున్నది జరుగుతుంది."

"వట్టిది. జీవితాధారం ఆస్థులమీద సరిహద్దులను కట్టుకున్నా, ఆస్తిపాస్తులులేనపుడు, భగవంతుడిచ్చిన మంచితో స్వతంత్రంగా బ్రతకవచ్చును."

వెంకట్రావు మాటలు అతిశ్రద్ధగా వింటున్న సుగుణ హృదయం జలదరించింది. ప్రతి పలుకు మదిలో మెదులుతూ ప్రతిధ్వనిస్తునేఉంది.

"నీ ఇష్టం" అని సుబద్రమ్మ లేచి నిలబడి, సుగుణ దగ్గరకు వచ్చింది.

"చూశావా తల్లీ! మీ అన్నయ్యవాదం!"

"అమ్మా! అన్నయ్యవాదం వేదం, అన్నయ్య భగవంతుడిచ్చిన మంచికోసమే బ్రతకాలి, అప్పుడే ధన్యజీవి అయ్యేది."

"సరి, వాడిపిచ్చి నీకూసోకింది. అయితే ఈ ఇంట్లో వేగటం కష్టమే! వాడ్ని భోజనానికిపిలు."

సుబద్రమ్మ వంటింట్లోకివెళ్లి, వడ్డించడంలో నిమగ్నురాలైంది. వెంకట్రావు ఆదరాబాదరా నాల్గు మెతుకులు నోట్లోవేసుకొని బయటకు వెళ్ళిపోయాడు.

బయట చీకటి గుయ్యారం ... కృష్ణలంక గట్టు మీద నడుస్తున్న వెంకట్రావుకి, ఎదురుగుండా కన్పించే ప్రతి వస్తువు నల్లగా కన్పిస్తుంది. రాళ్ళు తగులుతున్నాయి. ఎదురుదెబ్బలు మిగులుతున్నాయి. గట్టుదిగాడు. ఇళ్ళు కన్పించాయి. జనసంచారం లేదు. మానవులు శేరాణికౌగిలిలో ఘాఢసుషుప్తిలో మునిగివున్నారు. కొంచెందూరం వచ్చేసరికి, కృష్ణవేణి తరగలు కన్పించాయి. వడిలేదు. తడిసేల మీద వడివడిగా నడుస్తున్నాడు. నదిని సమీపించాడు. అలలు కదులుతున్నాయి. జీవిత వలయాలు తగులుకున్నాయి.

"ఈ విశాల ప్రపంచంలో అందరూ ఇంతేగా !" ఇసకదిబ్బమీద కూర్చున్నాడు.

మామయ్య:-బలసిన వళ్ళు...ఎఱ్ఱని కళ్ళు.. రాతిగుండె ... మండే బండ ... అమాయక జీవితాల పచ్చి నెత్తురు పీల్చి, మండే గుండెలనుపిండి నెత్తుటి బొట్టుల రాల్పించి, తనరానులు చేస్తున్నాడు. ధర్మం న్యాయం, నీతి, నిజాయితీ, జాలి, దయ, అభిమానం ఆదరణ ... వీటిస్వరూపాలు ఏ కోణంనుంచి వెదికిన కన్పించవు. రక్తసంబంధమైన అనుబంధాన్ని కూడ త్రుంచివేస్తాడు.

కుటుంబరావు మామయ్య అవతారంలో రెండవ అవతారం. పైకి మంచివాడుగా కన్పిస్తాడు ... స్వత సిద్ధంగా మంచివాడుకాదు. నటిస్తాడు. మంచి వాడుగా నటించి, జీవితాలను హతమారుస్తాడు. కళ్ళల్లో గంగానదులు కదులుతున్నా, హృదయంలో అగ్ని పర్వతాలు పగిలిపోతూ ఉంటాయి.

వెంకట్రావు వాళ్ల చిత్రాలు స్పష్టంగా చూస్తున్నాడు. నిశబ్దంగా ఉంది. భ యం క రం గా కన్పించింది. అటువంటి మనస్తత్వాలు భూమిమీద ఉంచకూడదు. భగవంతుడు వాళ్ళకు చావు అంత త్వరగా ఎందుకు ఇవ్వడు?

కాలేజి జ్ఞాపకానికి వచ్చింది. పేరు కొట్టేశారు. జీతం కట్టలేదు. శ్రద్ధగా చదువుకుంటున్నా, మంచి మార్కులు సంపాదిస్తున్నా ప్రయోజనంలేదు. జీతం కట్టాలి. డబ్బిచ్చి చదువుకు కొనుక్కోవాలి. ప్రతి వస్తువును, చివరకు విద్య మొదలుకొని మానవుడ్ని వరకు ఉబ్బిచ్చి కొనుక్కోవలసిందే ! డబ్బులేదు— బ్రతకాలి ... చదువుకోవాలి, ఎట్లా! తనతోటి విద్యార్థులంతా పెద్ద పెద్ద చదువులు చదువుచున్నారు. డాక్టర్లు, ఇంజినీర్లు, కవులు, ఫిలాసఫర్స్, ప్రొఫసర్స్, పెద్ద పెద్ద ఉద్యోగాలు, ఘనమైన మర్యాదలు, తనో! ఆశలు పెంచుకుంటున్న నిరాశాజీవి. జీవిత పురోగమనానికి పువ్విళ్లూరుతాడు. ఉత్సాహంతో జీవితంలో మంచి ఆశలను సృష్టించుకుంటాడు. తన ఆశలన్నీ అడియాశలవుతాయి. జీవిత సరిహద్దులచుట్టూ నల్లని నిరాశ తెరలు జారుతాయి.

తీరని కోర్కెలు, ఆరని ఆశలు, మారని ఆశయాలు ... అతని చుట్టూ తిరుగుతున్నాయి.

భూమి తనచుట్టూ తాను తిరుగుతోంది. తని చుట్టూ తాను తిరగటమే కాకుండా, సూర్యుడి చుట్టూకూడా తిరుగుతుంది. వెంకట్రావుచుట్టూ, అవికూడా అంతే ! జీవిత ఎడారి మధ్యంలో ఇంకిపోతున్న ఆశావాహినికి ఆనకట్టకట్టాలి. ఆ ప్రవాహాన్ని నవవసంతాన్ని అలంకరించుకుంటున్న ఉద్యానవనంవైపు మళ్లించాలి. తియ్యనికలలు, కమ్మనిపాటలు, కటిక-చీకటిలో కలిసిపోతున్నాయి.

"ఏం చేయాలి? " ఎవర్ని అడుగుతున్నాడు? కదలని ఆకాశం ... నడుస్తున్న మబ్బులు ...కదులుతున్న అలలు, మెదలుతున్న చెట్లు ... మూల్గుతున్న పుట్టలు. ఇవన్నీ అతన్ని చూచి నవ్వుకున్నాయి. అతని నివేదన విన్పించుకుంటున్నాయి.

నవ్వు ... నల్లని ఆకృతి ...

పువ్వు ... తెల్లని ప్రకృతి ... ఘ ర్ష ణ ... ఆశకు నిరాశకు మధ్య సంఘర్షణ.

వెంకట్రావుకి వెర్రెత్తుతోంది. తిడుతున్నాడు... ఎవర్ని : జాలిపడని వస్తువులన్నిటిని దుయ్యబెడుతున్నాడు. అసహ్యించుకుంటున్నాడు — ఎవర్ని ?

దరిద్రంతో చీకటి ముసుగులో కన్నీరు కారుస్తున్న అతన్ని తానే అసహ్యించుకుంటున్నాడు.

నడుస్తున్న చరిత్ర ... నటిస్తున్న మనుష్యులు ... వెక్కిరిస్తున్న లోకం ... విలపిస్తున్న యీలోకం... డబ్బుండి తినలేక ఏడుస్తున్న జంతువులు ... తినడానికీ తిండిలేక కుమిలిపోతున్న అనాథలు ... ...

ప్రపంచమంతా పెద్దనాటకం ... నమ్మకూడదు, వేషాలు వేసే వాళ్ళను అసలేనమ్మకూడదు ... కుటుంబరావు విలన్ ... మామయ్య మరో పెద్ద విలన్ ...

భూమి వీళ్ళందర్నీ భరిస్తుంది.
ఎంత కన్నీరు కారుస్తుందో పాపం
కాలం వీళ్ళందర్నీ లాక్కొని వెళ్తుంది.
ఎంత బరువును వహిస్తుందో పాపం!

చేటలో పడిన పాప కళ్ళు మెల్లమెల్లగా విప్పుతోంది. కాటిలో పడబోతున్న తాతకళ్లు మెల్ల మెల్లగా మూసుకుపోతున్నాయి...

“దేనికోసం వీళ్ళందరు పుడుతున్నారు?”

“దేనికోసం పుట్టిన వాళ్ళు మరికొంత మందిని పుట్టిస్తున్నారు?”

కాలాన్నడిగితే!!!

లోకం నవ్వుతుంది.

పిచ్చిలోకం ... వెర్రి మనుష్యులు ... మనస్తాపాలు మనస్థైర్యాలు ... మమకారాలు ... మోసాలు... రోషాలు ... వెక్కిరింపులు ... వెకిలితనాలు ...

వేదాంతంలో మునిగిపోయిన వెంకట్రావు మబ్బు కన్నీటి బురదలో మలినమైపోయిన చంద్రవంకలాగ చావు బ్రతుకుల మధ్య చరలాడే ప్రాణిలాగ, నిశలో నిర్వేదిస్తున్నాడు.

తెల్లగా తెల్లవారి పోయింది. కృష్ణలో దిగి మొహం కడుక్కొని, ఇంటికి బయలుదేరాడు.

“సుగుణ! మీ అన్నయ్య ఎక్కడ?” గుమ్మంలో కాలు పెట్టిన ఉత్తరక్షణంలో, జానకి మాటలు వినిపించాయి. సుగుణ వెంకట్రావుని చూచి క్షణం కాలంలో తల్లి దగ్గరకు వెళ్లింది. సుబద్రమ్మ సుగుణను వెంట బెట్టుకొని వెంకట్రావు కూర్చున్న గదిలోనికి వచ్చింది.

కళ్ళు లోతుకు పోయాయి కళ్ళల్లో ఎర్రచారలు పడ్డాయి. నుదుటిమీద ముంగురులు చిందర వందరగా పడిఉన్నాయి. సుబద్రమ్మ త్రుళ్ళిపడింది. మనస్సులో బాధపడింది. తల్లికళ్ళల్లోనికి చూశాడు. విరుగు, కరుగు, మరుగులేని అవ్యక్తమైన ప్రేమ తొణికిసలాడింది. ఆర్తి, బాధ, దుఃఖం లేని ఆ మాతృహృదయంతో అనూహ్యమైన ప్రేమ కళ్ళ వెనుక కట్టలు త్రెంచుకొని, కళ్ళముందు కదిలి పోతూ ఉంది. నిశ్శబ్దంగా నిలబడిఉంది.

“అన్నయ్యా! అమ్మనీ కోసం!” సుగుణ మాటలు ప్రతినరంలోనికి చొచ్చుకొని పోయి, ప్రతిధ్వనిస్తున్నాయి. ఏడ్వాలనిపించింది, తలకాయి నేలకేసి కొట్టుకోవాలనిపించింది.

“ఎంత కఠినాత్ముణ్ని! అమ్మ నా కోసం లోలోన ఎంత కుమిలిపోతోందో! అమ్మను ఎంత బాధ పెడుతున్నాను. నా పాపాలకు ప్రాయిశ్చిత్తంలేదు. నన్ను చంపండి!” తనలోతాను ఏడుస్తున్నాడు. హృదయ గోడల చుట్టూ కన్నీరు జారుతోంది.

“అబ్బ! ఎంత బాధ! జబ్బుతో బాధపడుతున్న వాడి కంటె ఎక్కువ బాధ ... అనుభవించాలి.” విలపిస్తున్నాడు. ఎవరూ మాట్లాడంలేదు. విరామాన్ని భరించడం కష్టంగా ఉంది.

“రాత్రంతా నీ జీవితం గురించి ఆలోచించి ఉంటావు. భగవంతుడు నీకు మంచిని చూపించి ఉంటాడు.” సుబద్రమ్మ అంటోంది.

“భగవంతుడు! అంతా వట్టిది. భగవంతుణ్ని నమ్మకూడదు. మానవుణ్ని అసలే నమ్మకూడదు. అంతా మోసం?” మొహంమీద పడుతున్న వెంట్రుకలను

చెవుల్లోకి తోస్తూ, తల్లి వేపుకి చూచాడు.

"ఎవర్నీ నమ్మవా ? పోనీ మీ అమ్మనైనా నమ్మలేవా ?" వెంకట్రావు త్రుళ్ళిపడ్డాడు.

"అమ్మ !" మెల్లగా మూల్గాడు.

"ఎవరికి మన మీద నమ్మకం లేకపోయిన వాళ్ళ మీద నైనా మనకూ నమ్మకం ఉండాలి. జానకి వచ్చింది."

"ఇంకా బ్రతికి ఉన్న వెంకట్రావుని చూడ్డానికి చూచిందా ?"

"తెల్లవారకుండానే వచ్చింది"

'నల్లని నాజీవితంచుట్టూ ప్రదక్షిణంచేయడానికా?'

"అవును..." ప్రక్కగదిలో నిలబడి ఉన్న జానకి గుమ్మందాటి, సుబద్రమ్మ ప్రక్కగా వచ్చి నుంచుంది.

"మీరంతా కలసి నా మీద దండయాత్ర చేస్తారా! రాజ్యాలు కోల్పోయిన రాజును ముట్టడిస్తే, ఫలితం సున్నె ... అయితే ఎందుకీ ప్రయాస"

సుబద్రమ్మ, సుగుణ లోపలికి వెళ్ళిపోయారు.

"ఇంత చిన్న వయస్సులో ఎంత వైరాగ్యం" నవ్వుతో, అతని చిన్ని నయనాలలోనికి తొంగి చూచింది.

"కుటుంబరావు కూతురువేనా ?" వెగటుగా అన్నాడు. వికృతంగా నవ్వుకున్నాడు.

"నిజాన్ని నమ్మలేవు. మంచి ప్రశ్న వేశావు తెలుసుకోవాలని ఉందా !" నెమ్మదిగా అంది. నవ్వు అధరాలమీద నాట్యంచేసింది.

"చచ్చిపోయిననన్ను ఇంకా ఎందుకు చంపుతావు—వెళ్ళు" బాధపడుతున్నాడు.

"కుటుంబరావు కూతురు నిన్ను చంపడానికి రాలేదు. చనిపోయిన వెంకట్రావును బ్రతికించడానికి"

"బ్రతకాలనిలేదు. చావాలని లేదు."

"అదే మంచి పని..."

"నీ పోర్షన్ పూర్తి అయింది. తర్వాత మరోపాత్ర వస్తుంది. త్వరగా తెరవాలాలి."

"మొదటి రంగంలో కథానాయకుడికి పిచ్చి ఎక్కుతుంది. పాపం ! మంచివాడే ! కాని మాయలో ఆమంచిని మరచిపోతున్నాడు. తననినమ్ముకొని వచ్చిన నీతిని నిర్మూలం చేస్తున్నాడు. తనకోసం వెతుక్కుంటూ వచ్చిన ధర్మాన్ని దూరంగా నెట్టుతున్నాడు."

"బ్రహ్మాండంగా ఉంది నీ కల్పన. హర్షధ్వానులు కోరుకుంటావా !"

"నిన్ను బాధ పెట్టడానికి రాలేదు. నేను బాధ పడటానికి. — బాధపడేనాకెందుకు నీ హర్షధ్వానులు"

"మీరెవరు నాగురించి బాధపడనవసరంలేదు. నన్నే బాధ పడనీయండి. మీరంతానన్ను మోసం చేస్తున్నారు. నన్ను బాధ పడ నీ య కుం డా చేస్తున్నారు."

"బాధంటే అర్థంకానపుడు బాధపడటం ఎట్లాగ నేర్చుకుంటావు. బాధ విషయం మరచిపో ... నీ ఎదురుగుండా మంచి బాట కన్పిస్తుంది. చూస్తే బావుంటుంది."

"కన్పించేది వెలుగుకాదు ... చీకటి. భయంకరమైన చీకటి ... నల్లనిమసి ... ప్రాణాలుతీసే మసి"

"వెలుగు ఎదురవుతున్నా, చీకటిని సృష్టించుకొనే వాళ్ళకు కన్పించేది చీకటేగాని, తెల్లని లోకాన్ని చూస్తున్నప్పుడు నల్లకళ్ళద్దాలను పెట్టుకొని చూస్తే ఏమవుతుంది? లోకం నల్లగాకన్పిస్తుంది."

"నా కళ్ళే నల్లద్దాలు. తెల్లని వస్తువులు నల్లగానే కన్పిస్తాయి. బాగా వర్ణించావు."

"పోనీ ... పాలు ... నీళ్ళు ... ఇవి రెండూ ఒకలాగే కన్పిస్తాయా ?"

"అయితే చీకటి వెలుగు ... రెండూ ఒకలాగే ఉంటాయిగా !"

"మహాత్ముల విషయంలో అన్నీ ఒకటే !"

"నీవు మహాత్ముడవు కావుగా ! నీ విషయంలో వేరుగా ఉండాలి. ఒప్పుకుంటావా ?"

వెంకట్రావు మౌనం వహించాడు. ఆలోచనలో నిమగ్నుడయ్యాడు.

"స్వలాభం కోసం మా నాన్న కోరుకుంటున్న విషయాన్ని బలవత్తరం చేయడానికి రాలేదు. పరిస్థితులు ప్రతికూలంగా ఉన్నప్పుడు, ఒకరినొకరు జయించాలని చూస్తుంటారు. మా నాన్న నీకు సహాయం చేసి, ఆ సహాయంద్వారా సమానమైన ప్రతిఫలాన్ని సంపాదించాలని ప్రయత్నంచేయడం నిజం. అది సహజంకూడాను. దానికి నీవు అంగీకరించడంలేదు. అటువంటి విషయాలకు అసహ్యించుకుంటావు."

"ప్రతి సంగతి అసహ్యంగానే కన్పిస్తుంది. బహుశా నీవన్నదిగూడా అంతేనేమో !"

"ఎదుటివారు బాధ పడతారని అనుకుంటే, హృదయంలో జాలి అనే వెలుగు, ఇంకా ప్రకాశవంతంగా వెలుగుతుంది."

"మీ నాన్నకు జాలి ఉందని నీ ఉద్దేశ్యం. అంతేనా !"

"మా నాన్న విషయం నీ వెప్పుడో చిత్రించుకున్నావు. నీ విషయంలో అటువంటిదే జరిగితే ఏమనుకుంటావు."

"ఇంతకాలం బ్రతికేవాడ్ని కాదు."

"చనిపోయిన తర్వాత ప్రాణంలేని గుండెలో జాలి పుడుతుందని ఆశపడుతున్నావా ?"

"ఆ ఆశలేదు. అది ఉంటే నెరవేరదు. నెరవేరకుండా ఉంటే. మరో జన్మ ఎత్తవలసి ఉంటుంది. తన భక్తుడిని శాపఫలితంగా, ఒకసారి చంపిన తర్వాత మరీ మరీ చంపాలని పునర్జన్మలకు కోరుకున్నాడు మహావిష్ణువు. మానవుడు తిరిగి తిరిగి బ్రతకడం ఇష్టం లేదు."

"వాదించడం వల్ల ప్రయోజనంలేదు. ఇదిగో ఈ డబ్బు తీసుకొని, రేపు జీతం కట్టు. ఇది మా నాన్నది కాదు. వారి స్వలాభం కోసం గూడా కాదు. కష్టపడి లేసు కుట్టి, దారం వడికి సంపాదించింది. కష్టపడి సంపాదించిన ఫలాన్ని సద్వినియోగం చేయడానికి, సదవకాశం లభించాలి. అదిప్పుడు లభించింది."

"నన్ను ఓడించడానికి ప్రయత్నంచేస్తున్నావు. నేను ఓడిపోను. అందులో ఆడదానివల్ల ఓడిపోవడం ఆత్మహత్య చేసుకోవడం లాంటిది"

"అని ఆత్మ వంచన చేసుకుంటున్నావు. మరొక్కసారి చెబుతున్నాను. నా ప్రయత్నం వెనుకమరొక ఆశలేదు. కష్టాన్ని సద్వినియోగం చేసి, ధర్మాన్ని కాపాడటమే నా ప్రయత్నం."

ఆమె వెనక్కి తిరిగి వెళ్లిపోతూ, గుమ్మందగ్గరకు వచ్చేసరికి, అకస్మాత్తుగా ఆగిపోయింది. మళ్ళీ వెంకట్రావు వేపుకి చూచి, అక్కడే నిలబడింది.

"నీ ఏకాంతాన్ని అంతరాయం కల్గించటం నా కిష్టంలేదు. కాని ఒక్కమాట మిగిలి పోయింది."

"వినలేను."

"అయితే సరి ... వెళ్తాను." ఆమె వెళ్ళిపోయింది. చీకటి మలుపులో "ఆ ఒక్కమాట కోసం" వెతుక్కుంటున్నాడు వెంకట్రావు. అది రాత్రికాదు. పగలే! వాస్తవిక వెలుతురులో వెతుక్కుంటున్న వస్తువు దొరకలేదు.

# ఖడ్గతిక్కన

శ్రీ కె. ప్రభాకరశాస్త్రి

[ఖడ్గతిక్కన రణరంగంనుండి పారిపోయివస్తాడు. శత్రుసైన్యం అధికంగా ఉండటంవలన తమ శక్తిని వృథాగా ధారపొయ్య మనసొప్పక వస్తాడు. అతని వస్త్రాలు రక్తసిక్తాలయినవి. దేహం గాయాలతో నిండి ఉన్నది.]

ఖడ్గతిక్కనః—అమ్మా...అమ్మా...తలుపు తియ్యమ్మా ...

తల్లిః-ఎవరు నాయనా ... ఇంత అర్ధరాత్రిలో.

ఖః-నేనమ్మా ... తిక్కనను. అమ్మా త్వరగా తియ్యమ్మా, నిలువలేను.

తః-వచ్చావా తండ్రీ, జయం మనదేనా ... రా నాయనా, (కోడలితో) అమ్మా ... నీ భర్త వచ్చాడు లే తల్లీ ... (తలుపుతీసి) యింత అర్ధరాత్రిలో ఏలావచ్చావు! శత్రువులు నామరూపాలు లేకుండాపోయారా?

ఖః-అబ్బ ఎంత బాధగా ఉందమ్మా ... ఒక పిరికిపంద దొంగచాటుగా బల్లెము విసరాడు, భుజములో గ్రుచ్చుకొంది... ఎంత బాధగా ఉందనుకున్నావు.

తః-ఎక్కడ తండ్రీ! – పోతుందిలే; ఇది అశాశ్వతము నాయనా! విజయమే శాశ్వతము, ఏది ఏమయినా విజయం మనదేగా ...

ఖః-అమ్మా ...

భార్యః-అత్తయ్యా! వారు అలసి ఉన్నారు. విశ్రాంతి అవసరము ... అంతా తరువాత మాట్లాడుకొందాము, ప్రక్క వేశాను. పడుకోండి?

ఖః-భరించలేని బాధగా ఉందమ్మా ...

తః-ఆ బాధ నాకు తెలుసు నాయనా, ఆ నాడు మీ తండ్రి యుద్ధరంగంనుండి తిరిగివచ్చేటప్పుడు నాకు ఏమికానుక తెచ్చేవారో తెలుసా? రక్త వస్త్రాలు, విడివడిన వారి కండరాలు ... వీరులకు విజయంకన్నా మిన్న ఏమున్నది తండ్రీ!

భాః-లేవండీ! పడుకుందురుగాని, అత్తయ్యా! గాయాలు కడిగి కట్టుకట్టనా ... ఏమండీ, ఏలా జరిగింది యుద్ధము, నిజంగా శత్రువులను ఎదిరించి దుర్మార్గాన్ని ఖండించటంలో భారతీయుడు ఎంత త్యాగశీలుడండీ! మీరు బాధ పడుతుంటే నా హృదయం పగిలిపోతుందంటే నమ్మండి. కాని విజయం గుర్తుకురాగానే ఆ బాధను మరపించగల ఆనందం నా హృదయంలోని బాధను అణచివేస్తుంది.

త:- పడుకో నాయనా, రేపు ఉదయం మాట్లాడుకొందాము ... వేడి నీళ్లు కాయి తల్లీ! నిజంగా భారతకీర్తి నిలబెట్టావు తండ్రీ! నాన్న పేరు సార్థకపరచావు. అయినా నా పిచ్చిగాని నీవు పుట్టింది ఏగడ్డమీద, పెరిగింది ఎవరి ఒడిలో ...

[తెలతెలవారింది. బాధతో మూల్గుతుంటాడు తిక్కన. భార్య తల్లి మంచందగ్గర కూర్చుని ఉంటారు. వారి ముఖాలు వికాసంతో ఉజ్వలంగా మెరిసి పోతున్నవి.]

తి: మన సైన్యాలు చాల లేదమ్మా, వారివి ఎంతో ఎక్కువగానున్నవి.

త:- ఇంతకూ పారిపోయివచ్చావా నాయనా?

ఖ:- పారిపోలేదమ్మా! నా కరవాలము దాదాపు పది శత్రుశిరాలను నరికింది.

త:- నరికితే నష్టముకాని లాభమేమిటి తండ్రీ! జయలక్ష్మి వరించలేదుగా.

ఖ:- వరించే దేనమ్మా! అయినా చాలా వరకూ పోరాడాను, కాని...

త:- కాని ఏమిటి బాబూ! వారు మిమ్ము లను తరిమారంటావు? మేము యుద్ధం చేయలేకపోయామంటావు? అందుకని వెనుదిరిగి వచ్చానంటావు?

ఖ:- అది కాదమ్మా!

త:- ఏదీ కాదు తిక్కనా .... నా కడుపున జన్మించినందుకైనా పగతురకు వెన్నిచ్చావనుకున్నాను. ఆ ధైర్యమంతా ఏమయింది తండ్రీ ....

ఖ:- ధైర్యానికేమమ్మా! రేపయినా వారి అంతు కనుక్కోకుండా ఉంటమా?

భార్య:- ఈ లోగా మీ అంతు వారు కనుక్కోకుండా ఉంటేగదా?

ఖ:- సపరివార సమేతంగా సైన్యాన్ని నడిపించి సమరంలో విజయం సాధించి తీరుతాము.

త:- నాయనా వృథా ప్రసంగం అనవసరం .. మాటలు చెప్పేవారు చేతులతో చెయ్యలేరేమో! నీ దక్షత నీ రాకలోనే అర్థమయింది. నిజంగా తలవంపులు తెచ్చావు.

ఖ:- అదేమిటమ్మా, తల్లివై యుండికూడా ... అయితే నేను ఆ శత్రుమూకల ఘోర ఖడ్గాలకు బలికావాలనా .... నీ ఉద్దేశ్యం.

త:- ఇన్ని రోజులు ఈమాట అన్నారా తండ్రీ! ఏ తల్లి స్తన్యజలాలతో పెరిగి పెద్దవాడవయ్యావో, ఏ తల్లి జోల పాటలో నిద్రపొయ్యావో ఏ తల్లి ఒడిలో అల్లారుముద్దుగా ఆడుకున్నావో

ఆ తల్లి హృదయాన్ని గ్రహించలేక పోయావు .... ఇదేనా నీవు అర్థంచేసికొన్నది! బానిసత్వంతో బ్రతికే బ్రతుకు కంటే చచ్చి స్వర్గంలో ఉండటం మేలు కాదా? పగతురకు భయపడి పరుగిడే దానికంటే ప్రాణాలు వదలటము వీరత్వం కాదా? దేశంకొరకు త్యాగం చెయ్యటం మహా భాగ్యం కాదా? నేను ఏమి చెప్పగలను నాయనా, చెప్పగలిగినదంతా యిదివరకే చెప్పాను. కాని నాకు భగవంతుడు వీరమాతనయ్యే అదృష్టం కలిగించలేదు. అందుకు దిగులుగానున్నది. అంటే .... అంటే, (అని నిట్టూర్పు విడుస్తుంది).

భార్య:-అత్తయ్యా వీరునికి ఉపదేశం వీరత్వాని ప్రసాదిస్తుంది. అదే పిరికి వానికి పిరికితనాన్ని ప్రసాదిస్తుంది. ఉపదేశం అనవసరం.

ఖ:-అర్థంలేని విజయ వ్యసనంతో కన్న కొడుకును, భర్తను త్యజించచూస్తున్నారా. ఎంత వింత ...

భార్య:-వింత కాదా-భారతీయుడు పగతురకు వెన్నిచ్చి వచ్చాడంటే వింత కాదా?

ఖ:-మీతో వాదించలేను. స్నానానికి నీరుతోడండి!

భార్య:-తోడాను దొడ్లో ఉన్నవి? వెళ్ళండి.

[తిక్కన దొడ్లోకి వెళుతాడు ... బిందె ప్రక్కన పసుపుముద్ద ఉంటుంది. మంచం చాటుగా పెట్టబడుతుంది. ఇది చూచిన తిక్కన బాధపడతాడు]

ఖ:-అమ్మా! యిదేమిటమ్మా ... యీ ఆచారం.

త:-అవును... ఈరోజునుండి మన యింట్లో ముగ్గురు ఆడవారమైనాము. కాబట్టి ఆచారప్రకారం అన్నీ అమర్చి ఉంటుంది కోడలు దానితప్పేముంది?

ఖ:-అయితే నన్ను స్త్రీకింద జమకట్టావా అమ్మా ....

త:-నే కట్టేదేముంది ... ప్రపంచమే అంటుంది.

[తిక్కన'తనలో అవును... అమ్మ చెప్పినదానిలో అబద్ధమేముంది? దీక్షతో యుద్ధంచేస్తే దిగ్విజయం తప్పకలభిస్తుంది. విజయంలేనప్పుడు వీరుడు జీవించటంకన్న మరణించుటమే మేలేమో? అవును అనవసరంగా మరణిస్తే... వీరునకు విజయమో వీరస్వర్గమో... మా అమ్మ నన్ను కించపరచటంలో ఆమె తప్పేముంది. అయ్యో! భారత చరిత్రకే తలవంపుల తెచ్చానే... నిజంగా ఎందుకింత పిరికివాడినయ్యాను! న్యాయంగా ఆలోచిస్తే నేను చేసిందే మేలేమో! అనవసరంగా వారికి ప్రాణాలు అర్పించే దానికన్నా బ్రతికి బయటపడటం మంచిదేమో! ముందు విజయం సాధించలేక పోతామా']

[తిక్కన భోజనం ముందు కూర్చుంటాడు. తల్లి విరిగిన పాలు పోస్తుంది]

ఖ:-అమ్మా! పాలు విరిగినవే

త:-అవును మానవులలోని రక్తం నీరుగా మారినపుడు, పశువులపాలువిరగడంలో

విం తేముంటుంది?

ఖ: అయితే ఏమిటమ్మా! నీ ఉద్దేశం ... మరణించ లేదనేనా?

త:- మరణం ... నిజంగా అదేమంచిదేమో తండ్రీ! నీరాకను చూడగానే సగం మరణించాను. నీమాటలు వింటుంటే మిగిలిన సగంకూడా మరణిస్తున్నాను. ఎన్నడూ లేనిది ఈ నాడు యింత పిరికి వాడివయ్యావేమయ్యా! దేశ భక్తి నీలో నశించిందా?

ఖ:- అమ్మా...

త:- అగునాయనా.... మాతృమూర్తికన్నా జన్మభూమి ఎక్కువని తెలియదా? రణరంగంలో దూకు - శత్రువులను వీరత్వంతో ఎదిరించు. విజయలక్ష్మి మనదేతండ్రీ ... దేశానికి ప్రతిష్టకలిగించు. ఈ తుచ్ఛ జీవితాన్ని ఒక సత్కార్యానికి అంకితంచెయ్యి! యింతకన్న మనం చేయగల మహాత్కార్యం ఏముంటుంది తండ్రీ!

(భార్య హారతితో ప్రవేశిస్తుంది) "అదిగో వీరపత్ని అగరుగంధాన్ని పులుముకో ... యుద్ధరంగంలో దూకు..."

ఖ:- అమ్మా! కళ్లు తెరపించారమ్మా! పిరికి జాడ్యంతో బాధపడే నాకు సరైన ఔషధాన్ని అందించావమ్మా! అందరూ నీవంటి తల్లులైతే భారతం ఎంత కీర్తి కొస్తుందమ్మా! చేయిచాచగల శక్తి ఉన్నంత వరకూ పోరాడుతాను. ఇదే నా ప్రతిజ్ఞ. విజయమో ... వీరస్వర్గమో ... దీవించమ్మా!

త:- (కనులు ఆనంద బాష్పాలతో నిండగా) విజయీభవ

(ఖడ్గ తీక్కొన రణరంగానికి అరుగుతాడు)

# అశ్రుతర్పణం

'పద్మ - నరేశ్'

(గతసంచిక తరువాయి)

"అదేంటక్కా! అలా అంటావ్! నీదగ్గరకు కాకపోతే మరెవరి దగ్గరికి పోగలను. ఆదరించి ఆజ్ఞనిచ్చే తల్లి పోయింది. ఇక నాన్నంటేమనసంగతే పట్టించుకోడుగదా! అలాంటప్పుడు నన్నాదరణచేసి మందలించే నీదగ్గరికి రాకుండా పోతానా?"

"ఆ మందలింపుకే లక్ష్మీ! నిన్ను పిలిపించింది."

ఈ మాటలు లక్ష్మికి యేమీ అర్థంకాలేదు. "నేనేం తప్పు చేశానక్కా?" అని భయంతో అడిగింది లక్ష్మి.

"నీవు తప్పేమీ చేయలేదు. ఒప్పే చేశావు. నీవు మూర్తిని అనురాగంతో చూస్తున్నావుకదూ!"

"అది తప్పంటావా?"

"తప్పుకాదు. చూడు లక్ష్మీ! ఒక పదునైన కత్తికూ ఒక మందమైన గుడ్డకు ఘర్షణ జరిగిందనుకో. అందులో యేదిగెలుస్తుందో చెప్పు!"

"కత్తికే గెలుస్తుంది!"

"అదినిజమేగదా! చూడు లక్ష్మీ! ఇప్పుడు నీవు నామూలాన తెలుసుకున్నావు. మన జీవితాలుగూడా మందమైన గుడ్డల్లాంటివి."

"క్షమించక్కా!"

"కాదమ్మా! వారు వారి సౌఖ్యాన్నే చూచుకుంటారేగానీ హృదయమిచ్చినవారిని కన్నెత్తైనా చూడరు. తమ సౌఖ్యం తీరిన పిదప మనలను వాడిన పూలలా పారేస్తారు. చూడు నా జీవితంలో నేనెంత ఆవేదన పడ్తున్నానో! నేను నాగేష్‌వల్ల మానమర్యాదలు పోగొట్టుకుని క్షోభిస్తున్నాను. నావలే నీవూ మానరహితవైతే నా వల్ల మర్యాద తగ్గిన ఈ కుటుంబం మరీ అన్యాయంకాదూ! కాబట్టి ముందరే భద్రంగా వుంటే మంచిది. ఇందుకే నిన్ను పిలిచింది."

ఈ మాటలకు లక్ష్మి కండ్లల్లో నీళ్లు తిరిగాయి. "అక్కా!" అంటూ కౌగలించుకుని బోరున యేడ్చింది.

ఆ మరునాడు ప్రొద్దున్నే మూర్తి లక్ష్మి దగ్గరకు వెళ్లాడు. లక్ష్మి మౌనంగా నిలుచుంది. ఇది మూర్తికి తానేదో తప్పుచేసినట్లు తోచింది. కానీ ఆతప్పేమిటో అర్థంకాలేదు.

"ఏం! లక్ష్మీ! అలావున్నావే?" లక్ష్మి మూర్తి తట్టు తిరిగి చూచింది. ఆమె కనుగొలుకులలో బాష్పకణాలు నిలచివున్నాయి.

మూర్తి హృదయంలో గాలివాన చెలరేగింది. ఎందుకు లక్ష్మి యేడుస్తోంది. తనేమన్నా తప్పు చేశాడా? లేదే! తనేమీ చేయలేదే! అయ్యో లక్ష్మి కంటినీరు తనహృదయంలో బాకు పోటులా బాధిస్తుంది.

"ఎందుకులక్ష్మీ ఏడుస్తున్నావు"

లక్ష్మి హృదయ భారంతో అతని తట్టు చూచి "అక్క ... అక్క..."

"ఆ! గీతా! ఏం! ఏంజరిగింది?" మూర్తిలో తొందరపాటు జాస్తయింది.

"ఏమోనండి! నాకు భయంగావుంది. రాత్రి కలలో ఏదేదో...చనిపోతాననీ ...... యింకా... భయంగావుందండీ!"

"అవన్నీ నువ్వు విన్నవా?"

"ఆ! రాత్రి అక్కయ్య రెండు గంటలదాకా నిద్రపోలేదు. అంతవరకూ ఏదో ఆలోచిస్తూ కూర్చొని వుంది."

"అయితే నన్ను గీత దగ్గరకు తీసుకపోతావా?"

ఇద్దరూ గీత గది సమీపించారు. గదిలో ఏ అలికిడీలేదు. లోపల ఎవరన్నా వున్నారా? అని సందేహం.

ఇద్దరూ లోపల ప్రవేశించారు. గీత ప్రశాంతంగా నిద్రపోతుంది. ఆమె నుదుటి మీద స్వేదకణాలు మెరసి పోతున్నాయి. ఆమె ముఖంలో తప్పులేని అమాయకం, అగుపిస్తున్నది.

ముంగురులు నుదుటిమీద గాలికి యిటూ అటూ లేగుతూ ఆమె అందాన్ని అతిశయింప జేస్తున్నాయి. ఆ నిశ్శబ్దంలో కంచుగంటలా శబ్దం మ్రోగింది.

"నాగేష్!" అని ఆ నిద్రలో గీత పెద్దగా అరిచింది. నిశ్చలంగా నిలుచుకుని చూస్తున్న లక్ష్మి, మూర్తి యిద్దరూ వులికిపడ్డారు. అంతవరకు ఆ నిద్రలోనే అతిప్రశాంతంగా వున్న గీత ముఖం రౌద్రంతో నిండిపోయింది.

"నాగేష్! నేను నీకు ఏం అపకారం చేశాను. నన్నెందుకిలా యేడిపిస్తావు? నీ క్షణికసుఖం కోసం నా జీవితాన్ని నాశనం చేస్తావా?" అంటూ పలవరించింది.

లక్ష్మికి భయం వేసింది. కానీ గీత కొంతసేపటికి ప్రశాంతంగా నిద్ర పోవడంచూచి యిద్దరూ గది విడిచి బయటకొచ్చారు.

9

పబ్లిక్ పరీక్షలయిపోయాయి. విద్యార్థులు ఒక్కొక్కరు పయనమవుతున్నారు వాళ్ల వూళ్లకు. మూర్తి స్నేహితుడురత్నంకు గీత స్నేహితురాలు కనకబాలకు కొద్ది రోజుల్లోనే వివాహం జరుగనున్నట్లు రత్నం చెప్పాడు మూర్తికి. తన పెళ్ళికి రమ్మని మూర్తి నాగేష్ గీతలకు స్వయంగా ఆహ్వానించాడు. గీత ఆలాంటి శుభకార్యానికి నోచుకోలేకపోయానుగదా అని ఏడ్చింది. ఓ రోజు నాగేష్ యింటికి మూర్తి వెళ్లాడు నాగేష్ యింట్లో బంధువులొచ్చారు కాబోలు యిల్లు కాస్త సందడిగావుంది. మూర్తిని చూడగానే నాగేష్ బయటికొచ్చాడు.

"ఏం మూర్తి! యిలా దారితప్పివచ్చావ్" అని నవ్వుతూ అడిగాడు నాగేష్.

"అది సరేగానీ ఏమిటీ యింట్లో మాజోరుగా వుందే?"

"పెళ్ళివారొచ్చారు మూర్తీ! బహుశా! ఈ నెలలోనే వుంటుంది ముహూర్తం."

"ఎవరికేమిటి?"

"ఇంకెవరికి! మనకే" అంటూ తలవాల్చాడు నాగేష్. మూర్తి నెత్తిన పిడుగుపడ్డట్టయింది. నాగేష్ సంగతి గట్టిగా తెలుసుకోవాలని పట్టుబట్టాడు. "నాగేష్! అలా రారాదూ! మాట్లాడుతూ అలా చల్లగాలి పీలుద్దాము" అన్నాడు మూర్తి.

"సరే" అంటూ నాగేష్ మూర్తిని అనుసరించాడు.

"నీ ముఖం ఎందుకో రత్నంలా మెరిసిపోతూ వుందే? పెండ్లి మహాత్యం కాబోలు" అని అన్నాడు మూర్తి నాగేష్ కళ్లలోకి చూస్తూ.

నాగేష్ ముఖం ఎందుకో వెలవెలపోయింది.

"ఎందుకు నాగేష్! అలా ఆశ్చర్యపోయావ్! నేనన్నదాంట్లో ఏమయినా తప్పు తోచిందా?"

"అబ్బె! ఏంలేదు" అని అంటూ తప్పించుకున్నాడు నాగేష్.

"నాగేష్! ఓ మాట అడుగుతాను. మర్మం లేకుండా జవాబిస్తావా?"

"ఏమిటి మూర్తీ! ఇవాళ యేదో క్రొత్తగా మాట్లాడుతున్నావు?"

"అవును. బుద్ధులు మారుతూవుంటే మనుష్యులు కూడా మారుతూవుంటారు. ఆ! అదంతా యిప్పుడు ఎందుకులేగానీ, ఈ పెళ్ళి నీ యిష్టంమీదనే జరుగుతూవుందా? లేక మీ నాన్నగారి నిర్బంధమా?"

"మా నాన్నగారే యీ సంబంధం కుదిర్చారు."

"అయితే నీ యిష్టంతో లేనన్నమాట."

"అందులో తప్పేముంది?"

"తప్పయేమీ లేదు. నీలో నిజంగా మానవత్వమే వున్నట్లయితే నీకా తప్పు కంటికి కనపడేది. నీ గుట్టు బయటపడితే యేంజరుగుతుందో ఆలోచించావా?"

నాగేష్ అనుమానంతో మూర్తితట్టు చూచాడు.

"అనుమానందేనికి? మీ నాన్నగారు సర్కిల్ యిన్స్పెక్టరు. ధర్మాన్ని నిలబెట్టవలసినవారు కానీ పడద్రోయవలసినవారు కారుగదా!"

నాగేష్కు మూర్తి యేంచెప్తున్నాడో తెలియలేదు.

"నీకు మానవత్వంలేదు నాగేష్!"

నాగేష్ మూర్తి మాటలకు వులికిపడ్డాడు.

"గీతను ఏమన్నా గుర్తించావా? నీ కోసం కుమిలి కుమిలి నశించిపోయింది. ఆమెను నీ మోసపు మాటలకు బలిచేశావు! నక్క వినయాలు చూపి నాశనంచేశావు. నీలో నాలుకుందా? యింత పైజాతికి పుట్టి యిలాంటి నీచానికి పాలుపడతావా?"

నాగేష్కు మూర్తి ధోరణి యిప్పటికి అర్థమయింది. అతను మాట్లాడే మాటలన్నీ తనలో క్రోధానికి క్రొత్త త్రోవను తీస్తున్నాయి. కానీ అతని క్రోధాన్ని వెలిబుచ్చే సమయం అతనికి దొరకలేదు.

"అంతేకాదు. ఆమె కాళ్ళమీదపడి వేడుకుంటే వాడిన పువ్వులా విసరివేశావు. నీ నీచత్వానికి సుందరినిగూడా బలిగొన్నావు ఇప్పుడివన్నీ తెలిస్తే మీ నాన్న నీకు పెళ్ళిచేస్తాడా? ఇవన్నీ యేమన్నా ఆలోచించావా?"

నాగేష్లో క్రోధమంతా పోయి ఆప్రదేశాన్ని భయం ఆక్రమించుకుంది.

"క్షమించు నాగేష్! నిన్ను యీ విధంగా మాట్లాడానని యేమీ అనుకోవద్దు. ఈ మాటలు చెప్పడానికి మీనాన్నను కలుసుకోడానికే నేనిక్కడికి వచ్చాను. గీతకు బదులు నేవచ్చాననుకో!"

నాగేష్కు మూర్తి మాటలు భయాన్ని కలుగజేశాయి. అతని శరీరమంతా స్వేదకణాలతో నిండిపోయింది.

"మూర్తీ! యిలా మాట్లాడడం నీకు మంచిది కాదనుకుంటాను."

నాగేష్ అసహాయస్థితి అతనిలో గోచరిస్తుంది.

"అవును! మంచిది కాదని నాకూ తెలుసు. కానీ నీవు చేసే చేష్టలు నీ భవిష్యత్తుకే మంచివి కావని యేమన్నా ఆలోచించావా?"

"అది నాకు తెలుసు! నీ బోధ నాకక్కర్లే!"

"అక్కర ఎందుకుంటుంది నాగేష్! కొద్దిగా ఆలోచించావా? నీవు నా చేతిలో కీలుబొమ్మవు. కీలుబొమ్మ ఆడించినట్లు ఆడుతుందనీ తన యిష్టమొచ్చినట్లు ఆడలేదని తెలుసుకున్నావా? నీవు నాకు చెప్పని రహస్యాలు కూడా నాకు తెలుసు. ఇవన్నీ మీనాన్నతో చెప్తే నీగతి ఏమౌతుందో తెలుసుకున్నావా? గ్రద్దగోళ్లలో చిక్కుకున్న కోడిపిల్లవు నీవు."

నాగేష్ యేంమాట్లాడలేక పోయాడు. ఈ సంగతులన్నీ తండ్రికి తెలుస్తే తనగతి యేమవుతుంది! నిజమే! తను గ్రద్దగోళ్ళలో చిక్కుకున్న కోడిపిల్లే! ఇందులో గ్రద్ద యెవరు? మూర్తా? తన తండ్రా? కాదు మూర్తే!

"మూర్తీ! యిది నీకు న్యాయమేనా? ఆనందం అనుభవిస్తుంటే కాలదంతావా? యిదేనా నీ స్నేహిత ధర్మం?"

మూర్తి ఆ మాటలకు యేమీ చెప్పలేకపోయాడు.

"క్షమించు నాగేష్! నీ ఆనందాన్ని కాలదన్నడానికిగాలేదు. నీవు యితరుల ఆనందాన్ని యెలా కాలదోస్తున్నావో తెలియజేయడానికివచ్చాను."

"చూడు మూర్తీ! యిప్పుడీ విషయాలు మా నాన్నగారికి తెలిపావంటే నీ మూలంగా యిద్దరూ కుమిలిపోతారు, నేనూ, నాకు కాబోయే భార్య!"

"క్షమించు నాగేష్! నీవల్ల ఓ జీవమే ప్రపంచంలో అగుపించకుండాబోతుంది. ఆ జీవం యెవరో కాదు. నీ గీతే! యిదికూడా కొద్దిగా గుర్తించు. నీ చేష్టలతో మగవారి ప్రకృతే నీచమని ఋజువు చేయబోతున్నావు. ఇంతే సంగతులు. కానీ ఈ విషయాలేవీ మీ నాన్నగారితో చెప్పనని గట్టిగా చెప్తున్నాను. మరో మాట! ఇపుడు రత్నం మంచంలోవుంది. అటో యిటో అనే చివరదశలో వుంది. ఓ మారు రా! ఆఖరుసారి నిన్ను చూచి ప్రాణాలు విడుస్తుంది. నీ జీవితంలో ఎవరినైనా సంతోషపెడానంటే అది కలయేమో అని తోస్తుంది" అంటూ కోపంతో వెళ్ళిపోయాడు మూర్తి.

## 10

ఈ విషయం జరిగిన ప్రక్కరోజే నాగేష్ సుందరి యింటికివచ్చాడు. మూర్తి నాగేష్ పెళ్ళి విషయం యేనాడో అందజేశాడు. సుందరి అతను వస్తున్నాడని తెలిసిన వెంటనే యేదో పనిబెట్టుకుని యింట్లోకి వెళ్ళింది. సుందరి తల్లి ఎలిమెంటరీ స్కూలులో టీచరుకావడంవలన ఆ స్కూలు యింకా మూయలేదు కాబట్టి ఆమె కూతురిని యింట్లో వదలి స్కూలుకు వెళ్ళిపోయింది.

నాగేష్ సుందరికోసం ఎంతో సేపుకూర్చున్నాడో-. విసుగుబుట్టింది. తను వచ్చింది మొదలు యింతవరకు పలుకరించలేదు.

నాగేష్‌కు కోపంవచ్చింది. కానీ ఆ కోపంతో అతనేమీ చేయలేకపోయాడు.

సుందరి అతనికి కోపంరావాలనే అంతసేపూ ఆలస్యంజేసింది. నాగేష్‌కు చిరాకు వేసింది.

"సుందరీ" అంటూ కోపంగా పిలిచాడు.

(సశేషము)



# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

శ్రీ కల్లూరి. అహోబలరావు.

(మే సంచిక తరువాయి)



౨౮

వామభాగంబున, పద్మాక్షి జానకి
భరత శత్రుఘ్నులు బరగకుడిని
ముందట మారుతి మోకాలిపై వ్రాల
వెనుక భాగమున లక్ష్మణుడు వెలయ
వాయువ్యమూలలో వాలి తమ్ముండు, వి
భీషణుఁ డీశాన్యవీథి నెలయ
నాగ్నేయమూలలో. నంగదుఁడుండ, నై
ఋతి, జాంబవంతుండు, నుతియొనర్ప
మధ్య నల్లగలువ మాడ్కి సుందరమైన
కాంతిచేత వెలసి గ్రాలునట్టి
రామ! భక్తవరద! రక్షింపుమయ్యా! నీ
జిత్తశుద్ధితోడ సేవఁజేతు.

౨౯

కల్పవృక్షముక్రిందఁ గనకమంటపమునఁ
బుష్పకం బొక్కటి పొల్పసంగ
రత్నపీఠంబందు రాజిల్లుచుండంగ
వీరాసనముతోడ వెలసినావు
పద్మాక్షి జానకి వామభాగంబున
రాజిల్ల, భరతుండు లక్ష్మణుండు
నిన్ను సేవింపంగ, నిష్ఠతోఁ బావని
జ్ఞానతత్త్వంబులు సదువుచుండ
మునితతికి, తత్త్వబోధన ముద్దుగాఁగఁ
జేయుచుండెదు, శ్రీరామ! చిద్విలాస!
శ్యామలాకార! సేవింతు శ్రద్ధతోడ
నాదు తాపత్రయంబుఁ బోనాడుమయ్య!

౩౦

అందెలొడ్డాణంబు హారముల్. కడియముల్
కర్ణపుష్పులుగల్గి. కాంత సీత
సుస్మితాననముతో శోభిల్లి. రుచిర వే
షంబున, కస్తూరి స్తనములందు
కర్పూర మిళితమై గంధంబుగానున్న
కతమున, ఘుమఘుమల్ గ్రమ్ముచుండ
లజ్జావతినిఁగాంచి, రాముఁడాలింగన
మొనరింప సీతకుఁ బులకలెత్త,
నవ్వుమోముతోడ నల్లనివాఁడైన
రాముఁగాంచి సీత రక్తిఁజెందె;
నట్టి సుందరాంగు నధిపు రఘుశ్రేష్ఠు
భక్తితోఁ దలంతు ప్రణతులొంగి॥

౩౧

బ్రహ్మకుఁ దండ్రివై వరలినవాఁడవు
శత్రు సంహారంబు సలిపినావు
విద్యాధరులచేత వినుతింపబడినావు
అంతట వ్యాపించి యలరినావు



4

వ్యాసుఁ డాంగీరస వరమౌని ముఖ్యులు
వినుతింపఁ గీర్తిచే వెలసినావు
ఆ విభీషణుఁ, శరణన్నఁ బ్రోచితివీవు!
భూజాత భర్తవై పాలిచినావు.
విష్ణురూపుఁడవై, లోకవితతి, సృష్టి
జేయుచును, పరిపాలించి, చేసివృద్ధి
ప్రజలఁ బోషించుచున్నావు రామచంద్ర!
శరణు వేఁడెద రక్షింపు కరుణగల్గి.

౩౨

మిథిలలో, శుభవారతిథియందు శ్రీరామ!
నీ వివాహంబు, వన్నియకు నెక్క
చంద్రకాంతమణులఁ జక్కఁగాఁ దీర్చిన
శుభపీఠమందుఁ గూర్చుండినావు
కల్యాణవేదికఁ గాంత సీతనుగూడి
వేదార్థములఁ బ్రీతి వినుచునట్టి
విద్వాంసులను, కడు వేడ్కతోఁ గాంచుచు
వారి యాశీస్సులఁ బరగఁబొంది
పెండికూతురు జానకి ప్రియము మొసంగ
వేడ్కనుంటివి; వహ్వారె! పెండ్లికొడుక!
నవ్యదంపతులరు మీరు - నాకు శుభము
సర్వవేళల నొసఁగుడీ జయము మొసంగి.

౩౩

దినకరకులబాల! దివ్యకోదండంబు
ధరియించి, శత్రుమర్దన మొనర్చి
మూడులోకములకు, ముదముఁ జేకూర్చి, త
నూకాంతిచేవింపి, లోకములను
వెలుగొందఁజేయుచు, విహరించినాఁడవు
దశరథ కులదీప! ధర్మహృదయ!
రత్నభూషణముల, రాజిల్లు శ్రీరామ!
శుభగుణచారిత్ర! సుందరాంగ!
దేవతాతతి పద్మముల్ - నీవు భాస్క
రుండవై, ముద మొసఁగుచు రూఢిగాగ
లోకరక్షణ జేతువు శ్రీకరముగ
ప్రాంజలిఁగొనుము; శ్రీరామ! భక్తవరద!

(సశేషము)






# విజయ - భారతి

కానాధిభొట్ల సుబ్బరావు

(మే సంచిక తరువాయి)

లోపలికి పోతే పంచరంగుల పావురమొకటి పంజరంలో వుంటుంది. ఆ పంజరంలోవున్న పావురపు పొట్టలో ఒక వజ్రముంది. ఆ వజ్రాన్ని పగులకొడితే నా ప్రాణం పోతుంది. అయినా అక్కడి రాక్షసులను తప్పించుకోవటమంటే మాటలా! అందుకనీ, ఓపిచ్చి దానా! మానవమాత్రుడెవడూ నా ప్రాణాల జోలికి రాడు. భయపడకు - అని చెప్పి ఓహ్. యింకా రెండు నెలలేగా నీ వ్రతం? ఆ పయిన మనిద్దరం... పకేనా — అని నవ్వుకుంటూ వెళ్లి పోయాడు పిచ్చి రాక్షసుడు.

ఇంక రెండు నెల్ల తర్వాత వివాహం చేసుకుంటూడట. వివాహం కాదు చేసుకొనేది - వినాశమై పోతాడు అనుకుంది విజయ మనస్సులో.

మర్నాడు మకరంద్ వచ్చాడు. విజయబాల రాక్షసుని ప్రాణవృత్తాంతమంతా చెప్పింది.

'ప్రాణరహస్యమయితే తెలుసుకున్నావు అయితే వాడిని చంపడమెల్లా అనీ.'

'అదే తెలుసుకోలేదు. అంత వివరంగా అడిగితే మన సంగతి బయటపడుతుందేమోనని సాహసించలేకపోయా. గట్టి చిక్కే తెచ్చావు విజయా! ఐనా ప్రయత్నిస్తానని నించున్న పాళంగా బయలు దేరాడు మున్యాశ్రమానికి.'

మకరంద్ మునివద్దకు వెళ్లి తన తల్లిదండ్రులను చూచి రావలెననియున్నదన్నాడు. వారినొకసారి చూచి తరువాత మునిదగ్గరకు వస్తానన్నాడు. దొంగ ముని విధిలేక సరేననవలసి వచ్చింది.

మకరంద్ అడవులూ ఎడారులూ, యిత్యాది మానవ ప్రవేశ దుర్లభ స్థలములనుండి వెళుతున్నాడు. మధ్యలో అతనికి దాహమైంది. అక్కడ ఒక కొలను వుంటే వెళ్లి దాహం తీర్చుకున్నాడు. ఒడ్డునే ఒక ముని తపస్సు చేసుకుంటున్నాడు. మకరంద్ మునికి నమస్కరించాడు. ముని అతనిని చూచి "నీవు హేమచంద్రుని కుమారుడివి కదూ" అని అడిగాడు. మకరంద్ ఆశ్చర్యపోయాడు.

"నాకంతా తెలుసు నాయనా" అని మకరంద్ జన్మవిషయం చెప్పాడు. "మరేం భయంలేదు. యిదిగో యీ ఖడ్గాన్ని తీసుకో - దీనిపేరు అమృతఖడ్గ. ఇది దగ్గర వున్నంతకాలం నీకే ఆపదారాదు సరికదా, జయమును తెచ్చి పెడుతుంది." అని ఒక ఖడ్గాన్ని సృష్టించి యిచ్చాడు. మకరంద్ మునికి నమస్కరించి విజయబాలను చేరుకుని సర్వవిషయం చెప్పాడు. విజయబాల ఎంతో సంతసించింది.

వెంటనే మకరంద్ పడమర దిక్కుగా బయలుదేరాడు. చాలా దూరం పోయిన తర్వాత ఐదు పచ్చసముద్రాలు కనిపించినై. అయితే సముద్రాలను దాటట మెల్లా. వెంటనే నిరాశపొందాడు. ఇంతలో ఒక మొసలి ఒడ్డున వచ్చే ప్రాణం పోయే ప్రాణంతో విలవిలలాడుతుంది. మొసలి అతనివైపు జాలిగా చూచి - "నన్ను రక్షించినట్లయితే నీవు కోరుకున్న

ఈ ఉపకారం చేసిపెడతా. ఒకతిమింగలం నా మీద కోపంవచ్చి ఒడ్డునవిసిరింది. నీళ్లలో వేసి పుణ్యం కట్టుకో. క్రూరజంతువునని భయపడకు" — అంది. మకరంద్ వెంటనే మొసలిని తీసి నీళ్లలో వేశాడు. మొసలికి ప్రాణంలేచి వచ్చింది. మకరంద్ వెంటనే తన కోరకను చెప్పాడు. మొసలి మకరందుని వీపు మీద ఎక్కించుకొని ఐదు పచ్చసముద్రాలనూ దాటి ఒడ్డునచ్చేసింది. మకరంద్ మొసలికి కృతజ్ఞత తెల్పి దక్షిణదిశగా ప్రయాణమయ్యాడు. సరే ఎలాగో పుట్టను చేరుకున్నాడు. కరవాలాన్ని ఝళిపించి పుట్టలోకి ప్రయాణమయ్యాడు, ఇంతలో సర్పాలు అతనిని చుట్టుముట్టినై. మకరంద్ ముని ప్రభావ కరవాల సహాయముచేత వాటి నెదుర్కొని చంపి వేశాడు, ఇంతలో రాక్షసుడు ఎలాకనుక్కున్నాడో. అదాటుగా వచ్చి పడ్డాడు. రాక్షసుడు మకరంద్ కరవాలాన్ని లాక్కొని ఒక మాయవలలో బంధించి వెళ్లి పోయాడు. తలవని తలంపుగా విపత్కరపరిస్థితి దాపురించింది. . తన కరవాలమును కూడా రాక్షసుడు లాక్కున్నాడు యింకేముంది? విజయబాలను రక్షించపోతే తనకే ముప్పువచ్చింది. ఎలా తప్పించుకోవటము? ఏమీ పాలుపోక నిర్జీవంలా చూస్తూ వుండిపోయాడు.

3

ఆ సాయంత్రం మళ్లీ ముని (రాక్షసుడు) విజయబాల దగ్గరకువచ్చి యిలా అన్నాడు. "ఇవ్వాళ ఒక గండం గడిచింది విజయబాలా. ఎవడో తుంటరి వెధవ నాదగ్గరకు చదువుకనివస్తే కనికరించి సరే నన్నా. ఆదొంగవెధవ నాయింట్లోతిని నాప్రాణాలకే ఎసరుపెట్టాడు. తిక్క కుదిరించానులే. వెధవ దగ్గర కత్తి లాక్కొని మాయవలలో బంధించాను. రేపు వాడికి నూరేళ్లు నిండుతై నూరుగురిలో చేరి పోతాడు. కాళికాదేవి వాడి రక్తాన్ని రుచిచూచి నాకు వరాలిస్తుంది" అని చెప్పాడు.

విజయబాల లోపల లోపల కలిగే దుఃఖాన్ని గుండెల్లో అదుముకుంది. ఎంతపని జరిగింది. పెద్ద చిక్కులో పడ్డాడే. ఎలారక్షించటం? ముని వెళ్లి పోయాడు. పాపం విజయబాల తన ప్రాణరక్షకునకు కల్గిన విపత్కరపరిస్థితిని తలచుకొని ఏడ్చి ఏడ్చి మూర్ఛపోయింది.

కొంతసేపటికి విజయబాల మూర్ఛ తేరుకుని కళ్లు తెరచి చూచింది. ఎదురుగా ఒకరాక్షస పరిచారిక నిలబడివుంది. "ఎందుకమ్మా ఏడుస్తున్నావు?" అని అడిగింది. ఈమె రాక్షసుని గూఢచారిణి ఏమోనని భయపడి విషయము బయటపెట్టలేదు.

రాక్షస స్త్రీ ధైర్యంచెప్పి — నన్నుగురించి అనుమానపడకమ్మా! నేనుకూడా నీవంటిదాన్నే. ఐతే నీవు మానవురాలవు. నేను రాక్షసిని. యిదే మనిద్దరికీ భేదము. వీడు నీవురాకముందు నన్ను బలాత్కరించి తెచ్చాడు. తనకు నన్నిచ్చి పెళ్లిచేయమని ఎంతగానో దండించాడు. కాని నాతల్లీ తండ్రీ అక్కా ఒప్పుకోలేదు. అందుకని వారందరినీ చంపి నన్నెత్తుకొచ్చాడు. దిక్కులేనిదాన్నై యిలా వుంటున్నా. యిప్పుడు మిమ్మల నెత్తుకరాగానే నన్ను మీకు సేవ చేయటానికి నియోగించాడు. వాడినిచంపే సమయంకోసం ఎదురుచూస్తున్నాను. మీ మకరంద్‌కు తప్పకుండా సహాయంచేస్తాను. వాడు చావటమే నాకు కావలసింది. ఆ ప్రతీకారమే నేనూ చెల్లించుకోవాలి — అంటూ వెళ్ళిపోయింది. ముని నిద్రపోతూన్న సమయంచూచి కరవాలాన్ని సంగ్రహించి విజయ బాలతో చెప్పి అదృశ్య రూపంతో మకరంద్‌ను చేరుకుని కరవాలాన్ని వలకు తగిలించగానే వల ముక్కలయింది. మకరంద్ బయటకువచ్చి రాక్షస వనితవలన సర్వవిషయమూ తెలుసుకొని ఆమెకు కృతజ్ఞత తెల్పినాడు. సరే మకరంద్ ఖడ్గము తీసుకొని పుట్టలోనికి చేరుకున్నాడు. ఈ మారుకూడా పాములు బుసలుకొట్టినై కాని ఖడ్గము వలన అవన్నీ చచ్చిపోయినై ఎదురులేని తన ఖడ్గ బలముచే రాక్షసుల నందరినీ జయించి పంజరమును తీసుకున్నాడు. ఇక జాగుచేసి ప్రయోజనము లేదని వెంటనే విజయబాలదగ్గరకు వచ్చాడు. రాక్షసునకు

విషయమంతా తెలిసింది. ఒక్కొక్కడిగా గుహ లోకివాలాడు. కాని మకరంద్ పావురాన్ని పొట్ట చీల్చాడు. రాక్షసుని పొట్టపగిలింది. అయినా వూపిరితో వున్నాడు. మకరంద్ రాక్షసునికి నానరక యాతనలు పెట్టి చివరకు వజ్రమును పగుల కొట్టాడు. రాక్షసుడు విలవిలా తన్నుకొని ఒక్క క్షణంలో నరకంచేరుకున్నాడు.

విజయబాల, మకరంద్, రాక్షసస్త్రీ ఎంతో సంతోషించారు. పీడావదిలింది అని చెయ్యి దులుపు కున్నాడు. విజయ బాల, మకరంద్, తమకు అత్యంత సహాయము చేసిన రాక్షస వనితకు కృతజ్ఞత తెలిపారు. కాని రాక్షసవనిత వెంటనే ఖడ్గాన్ని గుండెల్లో పొడుచుకుని — నా ప్రతిజ్ఞతీరింది. నా తల్లి దండ్రులూ అక్కా పోయారు. నాకుదిక్కు లేదు. పైగా రాక్షసుడు బలవంతంగా మానభంగంచేశాడు. పరువు పోయిన బ్రతుకెందుకూ. శీలంచెడిన తరువాత మానవవనితలేకాదు రాక్షసవనితలుకూడా బ్రతికి వుండటం స్త్రీ సమాజానికే సిగ్గుచేటు — పరలోకంలో నేనేమయినా పాపంచేసి వుంటే భగవంతుడే క్షమిస్తాడు అని తుదిక్షణాల్లో తన గాధ చెప్పకుని కళ్లుమూసింది.

తనశీలం, పోయినతర్వాత బ్రతుకెందుకని ఆత్మహత్య చేసుకున్న రాక్షస వనిత అమరత్వాన్ని చూచి కళ్లు చెమ్మగిల్లినై విజయకు. ఆమె నిష్కపటత్యాగానికి కళ్ళనీరు కార్చింది. శీలమనేది ప్రతీస్త్రీకి లక్షణమనే లక్ష్యాన్ని నేర్పిన రాక్షస వనితకు జోహారులర్పించింది. మకరంద్ రెండు కన్నీటి బొట్లురాల్చాడు.

ఇక రాక్షసుని పీడ వదిలిపోయింది. నిర్భయంగా తన రాజ్యాన్ని చేరుకోవచ్చుననుకున్నాడు. అయితే తనకు అమృత ఖడ్గమిచ్చి తనశ్రేయస్సును కోరిన మునిని దర్శించి పోదామనుకున్నాడు. విజయా మకరంద్ మునిదగ్గరకు వచ్చారు. ముని విషయమంతా తెలుసుకొని "కళ్యాణ ప్రాప్తిరస్తు" అని దీవించాడు. ఉభయులూ మునికి నమస్కరించారు.

ఐతే విజయబాల మాత్రం నానాటికీ చిక్కిపోతుంది. ఏమిటో మరి - తీరనివ్యాకులతతో బాధపడిపోతుంది. ఏమిటీ - విజయ ఎందుకు చిక్కిపోతుంది? ఈ విషయం మకరంద్‌కు అంతుపట్ట లేదు. ఉండబట్టలేక ఒకనాడు అడిగాడు — "ఎందుకు విజయా బెంగ. నేనేమయినా తప్పు చేశానా? పోనీ నేనంటే యిష్టంలేదా" అన్నాడు.

ఆమె కంటికి వెంట కడివెడు వానకురిసింది. "నాకు ఎవరిమీదా బాధలేదు నాకు ఒక అక్కయ్యవుంది. ఆమె పేరు భారతి ఇద్దరం కలిసి మెలిసి తిరుగుతూ ఎంతో అన్యోన్యంగా కాలంగడిపేవాళ్ళం. ఇలా వుండగా మేమిద్దరం ఒకసారి మేడమీద బంతు లాట ఆడుకుంటున్నాం. ఒకసారి బంతిక్రిందపడింది. నేను బంతికోసం క్రిందికి పోయి పైకివచ్చేసరికి అక్క కనుపించలేదు. కంగారుగా అమ్మానాన్నకు చెప్పాను. వారువెతికారు. కానికనిపించలేదు. ఎన్ని చాటింపులూ దండోరాలూ, బహుమతుల ప్రకటనలు చేయించినా జాడా కొరకలేదు. మేమంతా ఒక్క ఏడుపు ఏడ్చి వూరుకున్నాం. ఇంతలోనన్నుకూడ ఈ రాక్షసుడు ఎత్తుకొచ్చాడు. ఇప్పుడు నేను వచ్చానని అమ్మానాన్నకు సంతోషమైనా అక్క దిగులును మాత్రం మరపించ లేము. ఎలాగయినా ఆమెను కాపాడాలి. పాపం మా బావగారుకూడా అక్కజాడ వెతికి వెతికి వూరుకున్నాడు. ఎలాగయినా అక్క ఆచూకీ కనుక్కొని తీసుకురండి — " అని ప్రాధేయపడింది.

విజయబాల మాట కాదనలేకపోయాడు. మునికి సంగతంతా చెప్పాడు. "అలాగే వెళ్ళిరా నాయనా భయంలేదు. నీవువచ్చేవరకూ విజయబాలను సోదరిగా చూస్తూ ఆమెకు ఏలోటూలేకుండా కాపాడుతాను." అన్నాడు.

మునివద్ద సెలవు తీసుకొని బయలుదేరాడు. కాకులు దూరని కారడివిలోపడి పోతుండగా ఒక పట్టణం అగుపించింది. మకరంద్ ఆ పట్టణరాజు దగ్గరకు వెళ్లాడు. రాజు మకరంద్‌ను మర్యాదచేసి ఎక్కడికి వెళుతున్నావని అడిగాడు మకరంద్ తను పోతున్న పనిని తెల్పాడు.

"ఇక్కడికి ఉత్తర దిక్కుగా కారడివివుంది. అందులో ఒక రాక్షసివుంది. అది ప్రతిరోజూ మా పట్టణంలోకి వచ్చి మనుష్యుల్నూ, పశువులనూ గుటకాయిస్వాహా చేస్తుంది. దానినిచంప ప్రయత్నించి విఫలులమయ్యాము. బహుశా ఆ రాక్షసి ఎత్తికొచ్చిందేమో! ఐనా అక్కడికి పోవటమంతమంచి పనికాదు. చక్కగా తిరిగి వెళ్లు" అనిసలహాయిచ్చాడా రాజు.

మకరంద్ పట్టుదలతో ఉత్తరదిశగా ప్రయాణమయ్యాడు. కొంత దూరం పోగా క్రిక్కిరిసిన అడివి కనిపించింది. అలానే దారిచేసుకు పోతున్నాడు. ఒకచోట క్రిక్కిరిసిన ఇనుప ఆకు చెట్ల మధ్యగా దారి వుంది. ఆ చెట్లులోనుండి బయట పడేసరికి చచ్చినంత పనైంది. నెమ్మదిగా బయటపడి నడకసాగించాడు. మరికొంత దూరం పోయేసరికి వెలుతురగపడింది. ఆ వెలుతురు నెమ్మదిగా గుహాంతర్భాగానికి తీసుకుపోయింది. ఆశ్చర్యపడి లోనికి వెళ్లాడు. ఒక అందాల రాజకుమారి బంగారుటుయ్యాలలో వూగుతుంది. విజయ చెప్పినగురుతులనుబట్టి భారతి యీమేనని అనుకున్నాడు. ఐనా రాక్షసులు యిచ్ఛారూపులు కాబట్టి అవునో కాదో అని అనుమానపడ్డాడు. ఇంతలో ఆ యందాలరాకుమారి దగ్గరకువచ్చి రాజకుమారుని చెయ్యిపట్టుకున్నది. మకరంద్ చెయ్యి విదిలించుకున్నాడు. ఇంతలో రాజకుమారి రాక్షసిరూపుధరించి ఉగ్రకోపంతో— "ఉండు నీ పని చేస్తాని" అంటూ పర్వతములాంటి తన చేయితో పట్టుకొని ఒక చీకటి గుహలోనికి విసిరింది మకరంద్‌ను.

## 5

మకరంద్ పోయి పోయి కొన్ని శవాలమధ్య పడ్డాడు కాబట్టి దెబ్బతగలలేదు. ఇంతలో ఒకడు చస్తినిరోయ్ బాబూ అని కేక వేశాడు. వెనక్కి తిరిగిచూసేసరికి ఒక యువకుడు కొనవూపిరితో మూల్గుతున్నాడు. భరింపరానివాసన వెయ్యటంవల్ల రెండు సార్లు డోక్కున్నాడు. ఎవరు నువ్వని అడిగాడు మకరంద్.

"నేనుకూడా నీలాంటివాడినే బాబూ. ఖర్మం చాలక వాడి చేతిలో పడ్డాను. ఇందులో పారేశాడు. గాలిలేక చచ్చేస్థితిలోవున్నాను. నా కెన్నో మంత్ర విద్యలు వచ్చునుకాని ఏమిలాభం? యీ అపరిశుభ్ర ప్రదేశంలో అవ్వన్నీ నిష్ఫలమైనవి, ఇక మిగిలింది పరకాయ ప్రవేశవిద్య" అన్నాడు. మకరంద్ చుట్టు పక్కల చూచి చిలుక శరీరాన్ని అందించాడు. ఆ యువకుడు చిలుకరూపు ధరించి బయటకువచ్చాడు. ఆపైన తిరిగి గాబందు రూపంలోమారి రాక్షసుని ప్రాణం వెతకటానికి బయలుదేరాడు. కొంతసేపటికి రాక్షసివచ్చి గుహలోనికి చెయ్యిపెట్టి అందిన శవం తీసుకొని గుటుక్కుమనిపించింది. మకరంద్ ఆ రాక్షసి గోరుంపట్టుకొని బయటకువచ్చాడు. అంత పెద్ద రక్కసి స్వల్పజీవినిచూడకుండా వెళ్ళిపోయింది.

ఇద్దరూ రాక్షసిప్రాణ రహస్యం కనుక్కోటానికి ప్రయత్నిస్తున్నారు. ఇలావుండ ఒకసారి క్రొత్త యువకుడు కంగారుగావచ్చాడు "ఇదిగో చూశావూ దాని ప్రాణం కనుక్కున్నాను. ఆ రాక్షసి ప్రాణం కొండమీద ఒక శిలలోవుంది. నేను ఒకసారి అన్వేషణచేస్తూ కొండశిఖరంపైకివచ్చాను. ఈ రాయి దగ్గరకువచ్చి కదిలించాను. వెంటనే శిల నన్ను వెంటాడింది. చస్తూపడుతూ చావుతప్పి తప్పించుకున్నాను. ఆ శిలకే గనుక జీవశక్తి లేకపోతే ఎలా పరుగెడుతుంది" అన్నాడు. మకరంద్ ఖడ్గంతీసుకొని బయలుదేరి శిలనుచేరుకున్నాడు. శిల మకరంద్‌ను వెంబడించింది. మకరంద్ తప్పించుకున్నాడు. శిల వదలిపెట్టలేదు. కొండంతా తిప్పించింది. శిల మహా వేగంతో కొండ శిఖర మెక్కింది. కాని ఆ వేగంలో పైన నిలువలేక వేవేగంగా క్రిందపడి ముక్కలయింది. కాని మళ్లీ కలుసుకోపోయినై. ఇంతలో మకరంద్ వచ్చి కత్తితోకొట్టాడు. ముక్కలు పిండిపిండయి తిరిగికలుసుకోలేదు. రాక్షసి ఘోరంగా అరుస్తూ వచ్చి ప్రాణం విడిచింది. కాని ఆశ్చర్యంగా రాక్షసి భారతిరూపుపొంది మరణించింది.

ఇంతా కష్టపడి 'భారతి'ని చంపినానేయని దిగులుపడ్డాడు. కాని చనిపోయిన జీవాన్ని బ్రతికించటమంటే మాటలా! (సశేషము)

# శృతి లేని వీణ

శ్రీమతి కె. పార్వతీదేవి



బహుశా నీవు నన్ను చూడకుండా ఉంటేనే బాగుండేదేమో! ఆ నాడు నీవు నన్ను ఈ పొన్న చెట్టుక్రింద కూర్చుని చూశావు. అయినా నీవు చెట్టుక్రింద కూర్చుని ఎంతమందిని చూడలేదు? నేను యీ చెట్టుదగ్గరకు ... ఈ పొన్న చెట్టు దగ్గరికే నదిలో స్నానంచేయటానికివచ్చాను. ఛాతిమీద సన్నని సిల్కు కండువ మాత్రమేఉంది. చేతిలో సబ్బుపెట్టెతప్ప నా దగ్గర అపుడు ఏమీ లేదు. ఒక రోజున ఈ చెట్టుక్రిందే నాకు చెప్పావు. "ఆ రోజు నేను వస్తుంటే నూనెరాసి దువ్వని నా నల్లనిజుట్టు నా ముఖంమీద నాట్యం చేస్తున్నట్లు" మెలితిరిగిన కండరాలు అందులో దబ్బపండులాంటి ఛాతితో మెరసిన వన్నావుకదూ? అప్పుడేవస్తున్న నా నూనూగు మీసాలు చూడటంతోనే కామాలు నవ్వి ఉంటావు! ఈ చెట్టు దగ్గరే నేను స్నానంచేశాను, ఇక్కడ నిశ్చింతగా కూర్చొనే ఉన్నావు. ఇదే వేళలో రెండవరోజు స్నానానికివచ్చాను. నిన్నటివేళనే నీవు కూర్చుని ఉన్నావు.

కాని ఈ చెట్టే ఒక విషవృక్షమౌతుందని ఊహించలేకపోయాను. సరిగా సంవత్సరం క్రితం ఇదేవేళన ఇదేచోట నీవు నన్ను పలకరించావు. ఈ 'నేనే' నీకు సమాధానంగా చిరునవ్వు నవ్వాను. అదే నా జీవితంలో ప్రళయాన్ని సృష్టించిందా అని అనిపిస్తుంది నాకు! చిరునవ్వులు సంతోషాన్ని కలగిస్తాయనే అనుకున్నానుగాని దాని పర్యవసానం విషాదాంతమనుకోలేకపోయాను. ఆ చిరునవ్వు నా జీవిత దివ్యజ్యోతి అయింది. కాని ఆ దివ్యజ్యోతి ఇంతలో అంధకార బంధురమైతుందని కలలోగూడ ఊహించలేకపోయాను.

సరిగా ఇదే రోజున మాయింట్లో మేళాలు మ్రోగాయి. అవే నాకు ఆనందాన్ని కలిగించాయి. ఈ దౌర్భాగ్యునితో జీవితమంతా కష్టాలతో దాగుడుమూతలాడేదానికన్నా అదే మేలనుకున్నాను. కాని నా హృదయం ఉరిశిక్ష అనుభవించేవాడిలాగా ఉన్నది. సముదాయించుకొని నీ పూర్ణచంద్రముఖాన్ని చూస్తే ఆవేదన తగ్గుతుందేమో అనుకున్నాను.

అవును, ఇదే సమయానికి ఈ చెట్టు దగ్గరికివచ్చి నిలబడ్డాను. వడివడిగా ప్రవహిస్తుంది. తెల్లని వెన్నెల నల్లని నీళ్లపై బడి నిగనిగ మెరుస్తుంది. చల్లగాలి వీస్తుంది. కనులనుండి ప్రవహించేది

ఆనందాశ్రువులో దుఃఖాశ్రువులో చెప్ప లేనుకాని ఆ మలయమారుతానికి ఆరి పోయినవి. గొంతురానిస్థితిలో ఉన్నది. ఈ రాతి దగ్గరకే పచ్చరంగుచీర ధరించి వచ్చి ప్రతిమలా నిలబడ్డావు. మెడలోని నెక్లిస్ మిలమిలా మెరసిపోతుంది. నీ తెల్లని పలువరుస కనపడలేదు. నల్లని జడ వీపుపై లేదు. అపుడు నీ ఆకారం నన్ను ఆశ్చర్యానిచేసింది.

'రమా' అని పిలచాను.

'ఆఁ' అని ఊరుకున్నావు.

కాని నిన్ను చూస్తే చాల విచారం కలిగింది. నీ జీవితంకూడా ముళ్ళపొదలా ఉంటుందని అనుకోలేకపోయాను. నేను ఏమిచెప్పటానికి మనసుపోలేదు. ఈ చేతిని పట్టుకొని ... ఇదే చేతిని ... కనుల నీరు కార్చావు. ఆ నీరే నన్ను కఠినునిగా చేసినది. తప్పదన్నాను ... దుఃఖించవద్ద న్నాను. అప్రతిష్టపాలు కావద్దన్నాను. ఈ పెదవులే ఈ మాటలన్నవి ఇక్కడే ... ఇదే ఒక పుణ్యస్థలము ... ఇదే ఒక నరకము.

భగవంతుడా! ఒక స్త్రీ హృదయాన్ని గ్రహించలేనివాడిగా ఎందుకు సృష్టించావు? మావంశం అప్రతిష్టపాలు చెయ్యవద్దని మానాన్న చెప్పినట్లు ఈ పొన్న చెట్టుక్రిందే ఇద్దరము కూర్చొన్నపుడు చెప్పావు. అపుడు అర్థంచేసికోలేక పోయాను. ఈ జీవితం నీ జీవితానికి వెలుగుగా మారుద్దామనుకొన్నాను. కాని సుడిగాలి ఆర్పివేసింది. ఈ పూలగుత్తిని యీ చెట్టుదగ్గర ఉంచుతున్నాను. రేపు కూడా నేను వస్తాను. పచ్చని చీర కట్టుకోవటము మరచిపోకు. ...

—o—



# రాలిపోయిన పూలు

శ్రీ నేమాని సంగమేశ్వరరావు

రాధ ఎవరు? నేను ఎవరు? అనూరాధ ఎవరు? మా ముగ్గురికీవున్న సంబంధము ఏమిటి? ఈ ప్రశ్నలకు జవాబు బయటకు చెప్పలేనేమో! కానీ అంతర్గతంగా ఏదో వ్యథ నా మనస్సును కలచివేస్తూ యుంటుంది. అప్పుడప్పుడు ఏకాంతంగా నేను వీరిద్దరి గురించి విషాద బాష్పాలు రాల్చటంకూడాకద్దు. అయితే నన్ను నేను సమాళించుకొని కళ్లు తుడుచుకొనేవాడిని. ఈ అబలల దీన చరిత్ర నా హృదయ ఫలకంనుండి తుడిచివెయ్యలేకపోయేను. ఎందుకో ఈ ఆరాటం?

♦ ♦ ♦

రాధ నాకు వరుసకు మేనత్త కూతురవుతుంది. నేను పదిహేను సంవత్సరాల వయస్సులో ఫిఫ్తుఫారం చదువుతున్నప్పుడు, ఆ అమ్మాయికి పది సంవత్సరములు. నాలుగవ తరగతి చదువుతూ వుండేది. ... అంత అందగత్తె కాదు. అలా అని అనాకారి మాత్రం గాదు. నల్లగా కొంచము బొద్దుగా వుండేది. కళ్ళు మాత్రం పెద్దవి.

రాధ తండ్రికి కొంచము పిత్రార్జితము వుండగా మొదట స్కూలు మేష్టరుగిరీచేస్తూ, అది నచ్చక పౌరోహిత్యం స్వీకరించి జీవయాత్ర గడుపుకొంటున్నాడు.

రాధ స్కూలుకు వెళుతూ మా పెద్దనాన్న గారింట్లో దూరి బాదంకాయలు ఏరుకొని పోతూవుండేది. బాదంకాయలకోసం రోజూ మాకు తగువే! నేను మా పెద్దనాన్నగారింట్లోవుండి చదువుకొనేవాడిని. మా పెద్దనాన్న డాక్టరు.

మా పెద్దనాన్న అప్పుడప్పుడు రాధతో యిలా అనేవాడు — "ఏం రాధా! నువ్వు "బాజీని" పెళ్ళాడుతావా? లేక గోపాలుని పెళ్ళాడుతావా? రాధ మనస్సు ఎప్పుడు గోపాలునిమీదే యుంటుంది ... ఏమంటావ్."

రాధ నవ్వుతూ జవాబు చెప్పకుండా పువ్వులు, బాదంకాయలు ఏరుకొని తుర్రుమని తూరీగలాగ పారిపోయేది.

గోపాలుడు మా పెద్దనాన్నగారి అబ్బాయి. నాకంటె వయస్సులో ఒక సంవత్సరము చిన్న, నా పేరు బాజీ ... నేను ఎక్కువ అల్లరిచేస్తానట, అందుచేత "అల్లరి బాజీ" అని పిలిచేవాడు.

మా పెద్దనాన్న వద్దకు మందులకు, ఇంజక్షన్‌లకు రోజూ చాలమంది వచ్చేవారు. వాళ్ళలో ఎవరయినా సైకిలుమీదవచ్చి సైకిలు చేరబెట్టి లోపలికి వెళ్లేరంటే వారి సైకిలు అక్కడ వుండేదికాదు. నేనో మా గోపాలుడో తీసుకొని నాలుగు చక్కరులుకొట్టి ఆ సైకిలుగల ఆసామిని ముప్ప తిప్పలుపెట్టి మూడు చెరువులునీళ్లు త్రాగించేవాళ్ళము. అప్పుడే మేము క్రొత్తగా సైకిలు నేర్చుకొనేవాళ్ళము. ఒకమాటు గోపాలుడు సైకిలు త్రొక్కుతూ రోడ్డుకు ప్రక్కగా స్కూలునుండి యింటికి వెళుతున్న రాధ కాళ్ళమీద నుండి సైకిలు పోనిచ్చేడు. ... పాపం ఆ అమ్మాయి పడిపోయింది. ... నుదుటిమీద గాయంతగిలి రక్తం స్రవించడం మొదలు పెట్టింది. పరుగున మా పెద్దనాన్న వచ్చి యింటికి తీసికెళ్లి మందు వేసి గాయం మాన్పగలిగేడేగాని ఆ మచ్చను మాత్రం మాన్పలేకపోయేడు. ఆ మచ్చ శాశ్వతంగా వుండిపోయింది. రాధను మాత్రం వాళ్ళ తల్లిదండ్రులు ముద్దుగా చూసేవారు. కారణం! లేక లేక పదిసంవత్సరముల తరువాత కల్గిన ముద్దుబిడ్డ కావడంచేత! క్రమేపి ఒక చెల్లెలు ఒక తమ్ముడు కలిగేరు రాధకి.

♦ ♦ ♦

అనూరాధ ప్లీడరు రమణారావుగారి ఏకైక పుత్రిక. నేను ఫిఫ్తుఫారం చదువుతున్నప్పుడు ఆమె

తర్జుమారం చదువుతూ యుండేది. యవ్వనము తొంగి చూస్తూయున్న పన్నెండు సంవత్సరముల వయస్సులో ఆనందముగా -చీకు చింతా లేకుండా చదువు కుంటూ యుండేది.

ప్లీడరు రమణరావుగారి యిల్లు మా పెద్ద నాన్న గారి యింటికి మూడో యిల్లు. నేను అతనిని మామయ్యా అని పిలుస్తూ చనువుగా తిరిగేవాడిని. మా పెద్ద నాన్న గారు,రమణరావుగారూ స్నేహితులు. ప్రతిదినము సాయంత్రము ఐదుగంటలకు యిద్దరూ పిచ్చాపాటి చెప్పుకుంటూ చల్లగాలిలో వారధిమీద కూర్చుండేవారు. ఏ అర్జంటుకేసో వచ్చి మా పెద్ద నాన్న యింటికివచ్చేవారు. వకీలు మామయ్యగారు ఏరీడింగురూములోనో, ఏటౌను హాలులోను ఒకటి రెండు గంటలుగడిపి యిల్లుచేరుకునేవారు.

అనూరాధ రోజూ మా పెద్ద నాన్నగారింట్లో చాలా కాలము గడిపేది. మా దొడ్డమ్మను అత్తయ్యా అని పిలుస్తూ పెరట్లోపూసిన పువ్వులు ఏరుకొని జడ వెయ్యమని అల్లరిచేసేది. దొడ్డమ్మ విసుక్కోకుండా చక్కగా తలదువ్వి కాటుకపెట్టి "అనూ! నీకు వెంకిమొగుడు దొరుకుతాడులే! నీ అల్లరి అంతా అణుస్తాడులే" అని నవ్వుతూ అనేది. సిగ్గుతో తల వాల్చుకొని ఇంటికి వెళ్ళిపోయేది. స్కూలు పాఠాలు జాగ్రత్తగా చదువుతూ తెలివైనపిల్ల అని పేరుపడ్డది.

అంతవరకూ చదువుతూవున్న నవల కిందపడేసి, ఒకనాడు బేటుకుగట్ అల్లుకుంటూ యున్నాను.

ఎప్పుడు వచ్చిందో అనూరాధ అక్కడవున్న నవలుతీసి పేజీలు త్రిప్పుతూ.

"బాజీ, నువ్వు నవల్సు ఎప్పుడూ ఎందుకు చదువు తావు? అవి చదువుతే పిల్లలు చెడిపోతారని మా మాస్టారు చెప్పేరే?"

"అవి నాకు యిష్టము."

"మరి స్కూలు పుస్తకాలు చదవకపోతే మార్కులురావు. పరీక్ష ఫెయిలు అవుతావు"

"నేను ప్రతి సంవత్సరం పరీక్ష ప్యాసు అవు తున్నానా! అనూ! ఆ సంగతి నీ కెందుకుగాని ఏం యిలా వచ్చేవ్?"

"నా కలర్ పెన్సిల్ బాక్సు ఎక్కడో పారేశాను. మా జాగ్రఫీ మాస్టారు హిందూదేశముమేపు రంగు లతో వెయ్యమన్నారు. నీ కలర్ పెన్సిల్ బాక్సు ఒక మాటు యిస్తావా?"

లేచి షెల్ఫులోవున్న కలర్ బాక్సు యిచ్చాను.

తుర్ మని పారిపోయింది.

"పిచ్చిపిల్ల" అనుకున్నాను.

♦ ♦ ♦

కొన్ని వసంతాలు గడిచేయి. ప్రకృతిలోనూ ... నాలోనూ, ... నా చుట్టూవున్న వాతావర ణంలోనూ చాలా మార్పు లొచ్చేయి. నేను చదువు కున్నవూరు జిల్లా ముఖ్య పట్టణం అవడంవల్ల ఒక్క సారి పెరిగిపోయింది.

నాకు ఎక్కడో విసిరేసినట్టు దూరంగా ఒక స్సాలో రైల్వేలో వుద్యోగం దొరికింది. వివాహ మయింది - సుపుత్రప్రాప్తి కలిగింది. నేనూ, నా భార్య, కుమారుడూ అక్కడవుంటూ రాష్ట్రింతో పాటు బంధువులకుకూడా దూరమయి జీవితయాత్ర గడుపుకొస్తున్నాము. దూరాభారం! రైల్వే వుద్యో గము అవడమువల్ల తరుచు శెలవలు దొరకవు. ఎప్పు డయినా వుత్తరాలువస్తే బంధువులను, స్నేహితులను చూసినంత ఆనందము పొందేవాడిని.

"రాధకి వివాహమయింది ... అత్తవారింటికి వెళ్ళింది. రాధ భర్త అంతగా చదువు సంస్కా రముకలవాడు కాదు. అందుచేత తను పుట్టి పెరిగిన పల్లెటూరిలోనేవుండి వ్యవసాయము చూసుకొంటు న్నాడు. పాడిపంట కల్గిన సంపన్న గృహస్తులే.

రాధ సుఖపడవచ్చు" అని తమ్ముడు గోపాలుడు వుత్తరమురాసేడు. పోనీ సుఖపడ్డది గదా అని అనుకున్నాను. అనూరాధ విషయం యేమీ తెలియలేదు.

♦ ♦ ♦

ఒకనాటి సాయంత్రము స్టేషనులో తిరుగుతూ వీలరులో పుస్తకాలు తిరగేస్తున్నాను ... ఆ ప్రక్కనే ఇంటరుక్లాసు వెయిటింగురూమువుంది. అప్రయత్నముగా కళ్లు వెయిటింగురూమువేపు తిరిగేయి. ప్లీడరు రమణారావుగారు వెయిటింగురూము ఈజీఛైర్‌లో పడుకొని రైల్వేగైడు తిరగవేస్తున్నారు. లోనికి వెళ్లేను.

"నమస్కారం మామయ్యగారూ"

నన్నుచూసి పోల్చుకోలేకపోయేరనుకుంటా - 4, 5 సంవత్సరములు గడిచేయి నన్నుచూసి. నాలో చాల మార్పువచ్చియుంటుంది. అందుచేత వెంటనే గుర్తుపట్టలేక ముఖావంగా వుండిపోయేరు.

"నేను బాజీని మామయ్యగారూ" అన్నాను నన్ను నేను పరిచయంచేసుకున్నాను.

"ఓస్! నువ్వటోయి బాజీ!" ఎగిరి గంతేసేరు వకీలుగారు.

"అప్పటికీ యిప్పటికీ చాలా మట్టుకు మారిపోయేవ్. వొడ్డూపొడుగూ ఎదిగేవ్."

నేనూ నవ్వుతూ వూరుకున్నాను.

"రా. కూర్చో. ఇక్కడేం చేస్తున్నావ్ నువ్వు?"

"రైల్వేలో గార్డుగావున్నాను మామయ్యగారూ"

"వెరీగుడ్. చాల బాగుంది. సంతోషం. ప్రయోజకుడివయ్యావ్."

నేను మౌనంగా కూర్చున్నాను.

కొంచెముసేపు నిశ్శబ్దము.

"మీరు ఎటో ప్రయాణమయి ఈ వూరిలో బ్రేక్ చేసినట్లుందే" అని అడిగేను.

"అవునోయ్. కరగ్‌పూర్ వెళదామని పూరి ప్యాసింజరులో వచ్చేను. ఇక్కడ దిగేను. మా అల్లుడు కరగ్‌పూర్‌లో రైల్వేలో పనిచేస్తున్నాడు. అన్నట్టు ఈ సంగతి నీకు తెలుసుకదూ."

"తెలీదు మామయ్యగారూ."

"అవును నాలుగు సంవత్సరాలబట్టి యిటు ప్రక్కవుంటున్నావు. నీకు తెలియకపోవచ్చు. మా అనూరాధను కరగ్‌పూరు యిచ్చేను. అప్పుడే సంవత్సరమయింది అమ్మాయి అక్కడేయుంది. నిన్ననే మా వియ్యంకుడు టెలిగ్రాము యిచ్చేడు అల్లుడికి సుస్తీగా వుంది రమ్మని. గాబరాగా బయలుదేరేను. ఎలా వుంటుందో ..."

మామయ్యగారి ముఖంలో దిగులుకనిపించింది.

"మరేమీ గాబరాపడకండి మామయ్యగారూ! అదే తగ్గిపోతుంది. ఏదో మామూలు జ్వరం అయి వుంటుంది. లేకపోతే సీరియస్ అనే యిచ్చేవారు. రండి యింటికి వెళదాము. భోంచేసి రాత్రి యక్స్‌ప్రెస్‌కి వెళ్ళవచ్చును" అని యింటికి భోజనానికి ఆహ్వానించేను.

"ఎందుకోయ్. అనవసరం. నీకెందుకీ శ్రమ! ఇక్కడే ఏదో యింత టిఫిను తింటానులే."

"అదేమిటి మామయ్యగారూ! అలా అంటారు. ఇందులో నాకు శ్రమ ఏముంది చెప్పండి. రాక రాక ఈ వూరు వచ్చేరు ... ఈ విధంగానైనా మా యింట్లో భోంచెయ్యడం మీకు తటస్థించింది. నన్ను పరాయివ్యక్తికింద తీసుకోకండి" అని బలవంతము చెయ్యగా మామయ్యగారు ఒప్పుకున్నారు. ఆ రాత్రి మామయ్యగారు మా యింట్లో భోంచేసి ఎక్స్‌ప్రెస్‌కి వెళ్లేరు.

♦ ♦ ♦

ఒకమాటు దొడ్డమ్మకు సీరియస్‌గా వుందని టెలిగ్రామువచ్చింది. వెంటనే మూడు రోజులు శలవు తీసుకొని వెళ్లేను. భగవంతుని దయవలన నేను వెళ్లేసరికి ఆమె వొంట్లో కులాసాగాయుంది. నేను పెద్ద

నాన్న కష్ట సుఖాలు రెండు మూడు గంటలు మాట్లాడేము. ఎలాగు వచ్చేనుగదా తెలిసినవారందరి యిండ్లకు వెళదామని నిశ్చయించేను.

రాధ యింటికి మొట్ట మొదట వెళ్ళేను.

"ఏం ఓయ్! బాజీ ఎప్పుడు వచ్చేవు? రా కూర్చో!" అంటూ రాధ తండ్రి నాకు మర్యాద చేస్తూ కుర్చీ చూపించేడు. అప్పుడు మధ్యాహ్నము రెండు గంటలు అయివుంటుంది.

"ఏమే! బాజీ వచ్చేడు. పెద్ద వుద్యోగస్తుడయ్యాడు. కొంచము కాఫీ తీసుకురా" అని యింట్లో భార్యకు కేక వేసేడు.

కుర్చీలో కూర్చుంటూ "ఇప్పుడు కాఫీవద్దు. ఇందాకనే త్రాగేను" అన్నాను.

"ఏమోయ్ ఎప్పుడు వచ్చేవు? పోనీ మా మీద ప్రేమవుండబట్టి చూడడానికయినా వచ్చేవు."

"దొడ్డమ్మకు సీరియస్‌గా యుందని టెలిగ్రాము వస్తే నిన్న వుదయము వచ్చేను."

"ఎలావుంది ఆవిడ శరీరస్థితి?"

"ఇప్పుడు బాగానేవుంది."

"పోనీలే నాయనా - పెద్దల ఆశీర్వచనములవల్ల ఆ భగవంతుని దయవలన వెయ్యేళ్లు బతకాలి ఆమె" అంటూ కాఫీ తీసుకొచ్చింది అత్త.

"మొదట కాఫీ త్రాగు ... చల్లారిపోతుంది" అంటూ మామయ్య కాఫీ త్రాగమని బలవంతము చేసేడు.

కాఫీ గ్లాసు కాళీ చేసేను.

"రాధని అత్తారింటికి పంపేరటగా! గోపాలుడు వుత్తరముగా రాసేడు. ఈ మధ్యగానివచ్చిందా?" అని అడిగేను.

"ఏం రాధో ఏం లోకమో నాయనా! ఏం చెప్పడం! ఎలా చెప్పడం? ఇంతకీ ఆ దరిద్రుడిని అనాలి. ఒకరి ననవలసినపనిలేదు. దాని నుదుట యిలా రాసేడేమో ఆ బ్రహ్మ! మూడు నెలలయింది ఇక్కడేవుంది. దానికి అత్తవారింట పెట్టే బాధ యింతా అంతా అని చెప్పలేము. భరించి భరించి మరి భరించలేకపోయింది. రాత్రి రాత్రి ఎవరూ చూడకుండా ఎవరికి చెప్పకుండా ప్రాణానికి తెగించిన సాహసంతో ఈ పన్నెండుమైళ్లు నడిచి వచ్చేసింది" అంది రాధ తల్లి కంటతడిపెడుతూ.

"వాడు ఒక స్కౌండ్రల్ - విస్నావుకదూ! ఏదో తినడానికి యిన్ని గింజలొస్తున్నాయి; వుండడానికి ఒక కొంపవుంది. ఈ కాలము చదువుకున్నవాళ్లకి యింతకన్న ఎక్కువవుండి ఏడ్చిందా ఏమిటి? పిల్ల సుఖపడుతుందని ఈ సంబంధముచేసేను. కాని ఇలా వాడు పాములాగ కరుస్తాడని అనుకోలేదు. వాడికి యిద్దరు అక్కలువున్నారు. ఒక ఆమె విధవ. ఇంకొక ఆమెను భర్త వదిలిపెట్టేడు. వీళ్లిద్దరు యిక్కడ తిష్టవేసేరు. వీళ్లు రాధమీద ఆజమాయిషీ చెలాయిస్తూ వుంటారు. వాళ్లు చెప్పినదానికి తల్లి తాళంవేస్తూ యుంటుంది. ఈ మూర్ఖుడు వీళ్ళ ముగ్గురి మాటలువిని రాధని నానా బాధలు పెట్టేడు. పాపాత్ముడు చెయ్యకూడా చేసుకుంటూయుండేవాడు.

మా వాళ్లకు గతిలేదు - నీకు ఏమీపెట్టలేదు - ఇంత నీచమయినవాళ్లని అనుకోలేదు - ఇంత లోభులేమిటి - ఇలాంటి సూటిమాటలతో దాన్ని రోజూ పొడిచేవాడు. నేనేం జమీందారునా ఏమిటి వున్న ఎస్టేటురాయడానికి! - పాపం భరించింది రెండేళ్లు భూదేవిలాగ. మరి భరించలేకపోయింది. కుమిలి కుమిలి యేడ్చేది. ఆఖరికి చెప్పకుండా ప్రాణభయానికి వెరిచి వచ్చేసింది. ... పంపమని రెండు వుత్తరాలురాసేడు. పంపితే చంపుతాడేమో ... మా ప్రాణానికి వుసూరుమని చస్తుంది. యేంచెయ్యడానికి తోచలేదు. ఆఖరికి మరి పంపకుండా వుండడానికే నిశ్చయించాను.... మొన్ననే ట్రయినింగు స్కూలులో ప్రవేశపెట్టేను. అదేదో అయిపోతే తన బ్రతుకు

తనే బ్రతుకుతుంది ... మరేం జేస్తాము? మగపిల్ల వాడు అని అనుకుంటాను. ఏమంటావ్ బాజీ-?" అన్నాడు రాధ తండ్రి.

కళ్ళంట నీరు కారుతున్నాది. వ్యథ మాటలలో వ్యక్తీకరిస్తున్నాది.

అప్పుడే రాధ స్కూలునుండి కాబోలు వచ్చింది పుస్తకాల చేతితో. నన్ను ఒక క్షణంచూసి ముఖం దించేసి ఇంట్లోనికి వెళ్ళిపోయింది.

ఆ ఖిన్న వదనంలో "నా బాధలు ఏంచెప్పమంటావ్" అన్న మాటలు నాకు స్ఫురించేయి.

నేను ఏస్థితిలోవున్నానో నాకే తెలియదు. కుర్చీలో కొయ్య అయిపోయివుంటాను. "ఇంత చిన్న వయస్సులో యిన్ని బాధలా! ఆనందముగా చీకు చింతా లేకుండా బ్రతకకుండా ఈ అవస్థలేమిటి? పందొమ్మిది వందల ఏభయి ఆరులోకూడా యిటువంటి మూర్ఖపు భర్తలు వున్నారా? ఈ దీనురాలి జీవితం ఇంత వక్రంగా తిరుగు తుందని ఎప్పుడు అనుకోలేదు"

బరువుగా లేస్తూ "వస్తాను" అని బయలుదేరేను కాళ్ళీడ్చుకొంటూ ప్రతిజబాబు ఆశించకుండానే.

◆ ◆ ◆

జీవితంలో మార్పు లేదు... వుద్యోగంలో వుండాలని లేదు. బృహత్కథ నడవడానికి బలవంతముగా చేస్తున్నాను. క్రొత్తయేమీ లేదు .. రోజూ ఒకే టైమ్ టేబిల్. తీరుబాటుకాలం ఇంట్లో సుజాతతోను అబ్బాయి మధుతోను గడుపుతున్నాను. దేశం కాని దేశంలో మిత్రులు లేరు. తెలుగు పత్రికలు కూడా సాధారణంగా దొరకవు. చస్తున్నాను. బ్రతుకుబరువుగా గడుస్తోంది.

అప్పుడప్పుడు రాధ విషాదజీవితం హృదయంలో ప్రవేశిస్తోంది. బలవంతముగా తుడిచివేస్తూయున్నాను.

ఒక నాడు యింటికి వచ్చేసరికి సుజాత కవరు అందించింది. తమ్ముడు గోపాలుడు రాసినట్టుంది. కవరు విప్పేను.

"అన్నయ్యా"

"........అమ్మ శరీరస్థితి మళ్లీ బాగులేదు. ... నాకూ యింతవరకు ఏదీవుద్యోగము కలిసిరాలేదు... ఆర్థికపరిస్థితులు ఏమీ బాగులేవు ... పోనీలే యివి ఎప్పుడువున్నవే."

"అనూరాధ యిక్కడేవుంది... పాపం అనూరాధ యిప్పుడు ... విధవ. ప్లీడరు మామయ్యగారు చాల డబ్బు ఖర్చు చేసేడు. అనురాధ మామకూడ దగ్గర దగ్గర పాతికవేలు డాక్టర్లకి పోసేడు. "శానిటోరియంలో కూడ కొన్నాళ్లువుంచారు... కాని ఫలితం ...శూన్యం. ఇటుతలిదండ్రులకు, అటు భార్యకు, అత్తవారిని శోకసాగరంలో ముంచి అనురాధ భర్త టి. బి తో అస్తమించేడు. ఇకమిగిలింది గట్టులేని విచార ప్రవాహంతోవున్న అనురాధ. అన్నయ్యా ఆ అమ్మాయి విచారవదనం చూడలేక పోయేనను. ఇలా అవుతుందని కలలోకూడా వూహించేమా? కొన్ని నెలలు మాత్రమే సంసారసుఖంఅనుభవించింది... విధి బలీయము కదూ........."

కళ్ళంట నీళ్ళుధారా ప్రవాహంగా కారిపోతున్నాయి. సుజాత నీళ్లు చీరకొంగుతో తుడిచింది. ఇటు రాధ ... అటు అనూరాధ ... వీళ్ళ భావి జీవితాలు కటికచీకటులు.

"అదేమిటండీ అలాకంటనీరు పెడుతున్నారు" అని అడిగింది. సుజాత.

నిశ్శబ్దముగా వుత్తరం అందించేను. చదివింది వుత్తరము. "ఎవరయితేనేం సుజాతా! ... ఈ భారత దేశంలో యిలాంటి అభాగ్యవనితలు చాల మంది వున్నారు. వీళ్ళ భావి జీవితం గాఢాంధకారమయం. వీళ్ళలో చాలమందికి మళ్లా సంసారసుఖం అనుభవిద్దామని, మళ్లా వివాహం చేసుకుందామని వుండదు. ఇది భారత నారీమణుల ప్రత్యేకత. సర్వవిధముల భర్తనేనమ్మియున్న భారత స్త్రీకి భర్త గతించిన తరువాత జీవితం శూన్యం. అందుచేత

ఆమె మిగతాకాలం భగవన్నామ స్మరణతో పూజలతో కాలము గడుపుతుంది. ఇప్పుడిప్పుడు కొందరు ద్వితీయ వివాహం చేసుకుంటున్నారు. అలాంటివారలను చూపించి సంఘము వేలుచూపు తుంది. లోకం వాగుతుంది. మగవాడికా ఆ బాధ లేదు. భార్యను వదలిగాని, భార్యగతించేకగాని ద్వితీయవివాహం చేసుకోవచ్చు. సంఘమే దానికి దారి చూపుతుంది. లోకం హర్షిస్తుంది ........ పాపం ... ఈమె నాస్నేహితురాలు ... సోదరి కంటె ఎక్కువగా భావించేవాడిని. ఈమె వివాహ మాడదలిస్తే సంఘం తప్పక ప్రోత్సహించాలి!!

నా కళ్ళనుండి కారిన వేడి కన్నీటి కణాలు చూస్తూ స్తబ్ధులాగ నిలబడిపోయింది సుజాత.

# త్యాగమయి

శ్రీ ర్యాలి సూర్యనారాయణ

[శతశృంగ పర్వత ప్రదేశం. పాండు రాజు కుటీర పరిసర ప్రాంతం. సమయం సాయంకాలం. మాద్రి పుష్పాపచయం చేస్తూ ఉంటుంది. పాండు రాజు ప్రవేశిస్తాడు]

పాండు రాజు:—ఏంచేస్తున్నావ్ మాద్రీ?

మాద్రి:—విరియ బూసిన పూల మొక్కలకి విశ్రాంతి చేకూర్చుతున్నా ప్రభూ! విహారానికి పోలేదు కాబోలు?

పాం. రా:—లేదు మాద్రీ! ఈ వనరామణీయకత మనోల్లాసం కలిగిస్తే ఇలా వచ్చాను. కుంతీదేవి యెక్కడ?

మా:—లోపల ఉన్నారు.

పాం:—ఆమెకి ఈ వినోదాలే అక్కరలేదు. చూశావా మాద్రీ! వసంతాగమంతో ప్రకృతి యెంత రసోద్రేకమైనట్టు కన్పిస్తుందో?

మా:—అవును ప్రభూ! అది ప్రకృతి ధర్మం.

పాం అదిగో ఆ రసాలశాఖమీద చూశావా చిలుక జంట ఎంత ఆహ్లాదంగా ఉన్నాయో? ఈ మధురవసంతంతో జడప్రకృతులకి కూడా రసోద్రేకం కలుగుతుందంటారు మహాకవులు. నిజమేననిపిస్తుంది కదూ!

మా:—(ఆలోచిస్తూ ఉంటుంది)

పాం:—ఏమిటి మాద్రీ ఆలోచిస్తున్నావ్? ఈ మధురవసంతంలో మనోహారిణితో

మా:—ఏమిటి ప్రభూ ఈ ధోరణి?

పాం:—అవును మాద్రీ! ఈ ప్రకృతి సౌందర్యం చూస్తే నాలో నిద్రణమైయున్న యేదో శక్తి తల యెత్తుతోంది. మనస్సు వివశం అయిపోతోంది.

మా:—ఏమిటీ వింతధోరణి ప్రభూ! మన పరిస్థితి. మన ఈ అరణ్యావాసం మరిచిపోతున్నారా?

పాం:—లేదు మాద్రీ! కాని దానికన్నా అతీతమైన మహోద్రేకం నన్ను వశం చేసుకుంటోంది. మధుపాలఘుంకారాలు, ఈ మలయ మారుతాలు ఈ......

మా:—ఆపండి ప్రభూ! అంతకంతకీ అవివేకంలో పడిపోతున్నారు. కాస్త నిగ్రహించుకోండి.

పాం:—సాధ్యం కాదేమో మాద్రీ! నా శరీరంలో ప్రత్యణువు తీరని దాహంతో తపించి పోతోంది. నిగ్రహం నా కింక...

మా:- అబ్బా! యింత ఉద్రేకమా! అదిగో కుంతి అక్కగారు పిలుస్తున్నారు. (పోతుంది)

పాం:- మాద్రీ! మాద్రీ!! (నిష్క్రమణ)

రెండోరంగం

[ఆ విధంగా పాండురాజు సర్వభూత సమ్మోహనంబయిన వసంతంలో మదన సమ్మోహన మార్గాన బందీకృతమానసుండై మాద్రి దేవి మనోహరాకృతి యందే మనస్సు నిల్పి ఉన్నాడు. ఒక్కనాడు ... ]

పాం:- అబ్బ! మాద్రీ! మళ్లీ యెన్నాళ్లకి యేకాంతం దొరికింది? కుంతీదేవి యెక్కడ?

మా:- బ్రాహ్మణ భోజనం చేయిస్తున్నారు. అయిపోవచ్చింది.

పాం:- అప్పుడే యెక్కడ లే! అబ్బా! మాద్రీ! యీ నాడు యింత సౌందర్యంగా కనిపిస్తున్నావేం? నువ్వు ధరించిన చంపకం, బంగారాన్ని పరిహాసిస్తోంది. నీ మెళ్లో మెరుస్తున్న...

మా:- ప్రభూ! అంతకంతకి యిలా మారిపోతున్నారేం?

పా:- ఆ ముత్యాల హారం ఎంత శోభ చేకూర్చిందను కున్నావ్? అన్నింటికన్నా మించి...

మా-:ఆపండి స్వామీ! యీధోరణి!

పాం:- ఆ, వకుళ దామం, నీ అందాన్ని మరింత మనోహరంగా చేసింది. ఈ అందంలోనిన్ను చూస్తోంటే నాలో ..

మా:- యోచించండి ప్రభూ! మన పరిస్థితి కాస్త గమనించండి. క్రిందటి మనశాపం మరిచిపోయారా? తలపగిలి. అమ్మయ్యో! వద్దు.

పాం- శాపాంతం యీనాడు అయిపోయినా సరే మాద్రీ! ఇంక నా మనస్సును నేను నిగ్రహించుకోలేక పోతున్నాను. ప్రాణం పోయినా...

మా:- క్షణికమైన సుఖంకోసం నిండు జీవితాన్ని చేతులారా నాశనం చేసుకుంటారా స్వామీ!

పాం.- ఇంకేం నాశనం మాద్రి! సర్వ ప్రాణులకు అనుభవార్హమైన సుఖాన్ని నాకు దూరం చేశాడు కిందముడు. ఇంక ఎంతకాలం ఈ మొండిబ్రతుకు...

మా -మా పసుపు కుంకుమలకోసమైనా ఈ అఘాయిత్యం మానండి ప్రభూ! మీ సుందర స్వరూపాన్ని చూచుకుంటూనైనా మా బ్రతుకులు గెంటనివ్వరా?

పాం:- ఇంకేం కావాలి మాద్రి నాకు? అపురూప సౌందర్యవతుల్ని వివాహమాడాను. అశేష రాజ్యసుఖాల్ని అనుభవించాను. అసమాన మూర్తులైన కొడుకుల్ని కాంచాను. ఇంకనాకేం

కావాలి? నీ సౌందర్యం ఒక్కటే నాకు...

మా:-ఆగండి ప్రభూ! నా మీది మమకారంతో నాకుతీరని అపనింద కలిగేలా చేస్తున్నారు. చూసి చూసి ప్రాణవిభుని ప్రాణంతీసే ఘాతుక కృత్యానికి నన్ను కారణభూతురాలిని చేయకండి.

పాం:-అబ్బా ఏమిటీ వాదన మాద్రీ! నీ పాతివ్రత్యధర్మం యేమయింది? సతికి పతి సౌఖ్యంకన్నా కావలిసిం దేముంది? భర్తగా నిన్ను ఆజ్ఞాపిస్తున్నా - నా కోరిక...

మా:-వద్దు! వద్దు! ధర్మపన్నాలతో నన్ను బంధించకండి. మీ యీ చర్యకి ఫలం కలకాలం అనుభవించవలసిన దాన్ని నేను తీరని కళంకంతో...

పాం:-కళంకం అయినాసరే తప్పదు. ఇంక నీతో వాదించి లాభంలేదు. బలవంతంగా ..

మా..ఆగండి ప్రభూ! ఆ ... గం ... డి (ప్రక్కన)

## మూడో రంగం

("కెవ్వు" మన్న మాద్రి కేకతో లోపలనున్న కుంతీ, కుమార పాండవులూ పరుగెత్తుకువచ్చారు. ఆ పరిసర కుటీరాలలోంచి మునులు కూడా వచ్చారు. పరిస్థితి గమనించి దిగ్భ్రాంతులై పోయారు. రోదిస్తున్నా కుమార పంచపాండవులను తీసుకుని బయటకి నడిచారు)

కుంతి:-మాద్రీ! ఏమిటమ్మా యీ ఘోరం!

మాద్రి:-పాపాత్మురాలిని, క్షమించండి సోదరీ!

కుం:-క్షమించడం యేమిటి మాద్రీ! యింత ఘోరం జరగాక. తుచ్ఛశారీరక సౌఖ్యంకోసం, మహారాజు నిండు ప్రాణాన్ని...

మా:-లేదక్కా! యెంత చెప్పినా వినలేదు. చివరికి కిందమశాపంకూడా జ్ఞాపకం చేశాను. అయినా సరే బలవంతంగా ....

కుం:-మహారాజే బలవంతం చేశారో, మహారాజునేబలవంతంచేశావో! ఎలా అయితేనేం నా పసుపు కుంకమలు కూడా...

మా:-ఇందులో నా తప్పేంలేదక్కా! ఎంత చెప్పినా...

కుం:-ఇంకెందుకమ్మా! ఈ వేదాంతం? అయిన మహారాజు అస్తమించారు. ఈ మహారణ్యంలో ఈ పిల్లలతో దిక్కుమాలినదాన్నయ్యాను. అయినా అసది ఎంతకేనా తెగిస్తుందని ఊరికే అన్నారా?

మా:-కుంతీదేవీ!

కుం:-అవును నీ అపురూప సౌందర్యమే మహారాజు మతి పోగొట్టింది. ఆయన

కెదురుగా నిన్ను పోనివ్వడం నాదే తెలివితక్కువ. ఇంకెందుకు లే! పాండు మహారాజు మనః ప్రియధర్మ పత్నిని కనక ఒక్కతెనూ యింక ఉండ లేను. పిల్లల్ని చూసుకుంటూ ఉండు.

మా:-అలా అనకండి అక్కా! ఇంత అనర్థానికి కారణం అయిన నన్నింకా బ్రతికి ఉండమంటున్నారా? నేనే మహారాజుతో ....

కుం:-అదేం? ఇంతా వయస్సైనా ...

మా:-ఎందుకు వచ్చిన వయస్సు? ఈ వయస్సు వ్యామోహంలోనే భర్త ప్రాణాల్నికూడా వదులుకున్నాడు. ఈ శరీరం అగ్గిలోబుగ్గి అయితేనేగాని పాప శాంతికాదు.

కుం:-ఉద్రేకంతో తొందరపడుతున్నావేమో! ఆలోచించుకో.

మా:-ఇంక ఆలోచన యేముంది కుంతీదేవీ! ఇంకా బ్రతికి కలకాలం కళంకం భరించమంటారా? వద్దు. నా దురదృష్టవశాత్తు నాఅందమే నాకు శత్రువైంది. నా నాథుణ్ణి హరించింది. అయితే ప్రియనాథుని కడసారికోర్కె తీర్చగలిగాననే తృప్తి ఒక్కటే నాకు ఉంది చాలు. ఆ సర్వసాక్షికి నా మనోనాథునికీ తెలుసు నా హృదయావేదన. నిజానిజాలు ధర్మాధర్మాలు యోచించని ఈ లోకంలో నేను బ్రతకలేను. మన్నించి...

కుం:-వెర్రిదానా! ప్రపంచం యేం చూశావని ఈ వైరాగ్యం? సమాధాన పరుచుకుని ...

మా:-ఇంకెందుకు కుంతీదేవీ! అనుభవం లేని నేను ఈ ప్రపంచంలో నెగ్గుకురాలేను. వంశధర్మానుసారంగా కొడుకుల్నికని ప్రాణనాథునికి ప్రియం కలిగించాను. ఈ లోకంలో నేను ఈయలేని సుఖాన్ని ఆలోకంలోనైనా యిచ్చే అవకాశం నాకు దూరంచేయకండి. అడ్డు చెప్పక నాకు ...

కుం:-అది కాదు మాద్రీ! పిల్లల్ని చూసుకుంటూ ....

మా:-మృగశాపభయం తెలిసి ఉంటూ కూడా అజాగ్రత్తగాఉన్న నేను పిల్లల్ని పెంచలేను. మీరే ఆధారం వహించండి. బాహ్య విషయాలని మాత్రమే పరిగణించే ఈ లోకపు నీలాపనిందలు నేను భరించలేను.

కుం:-మాద్రీ! ...

మా:-ఇంకేం అడ్డు చెప్పకండి. నమస్కరిస్తాను. మానవ చరిత్రలో నా పేరు అడుగున పడిపోయినా విచారించను. కళంకితం కాకుండా ఉంటే చాలు ఇప్పటి వారు నన్ను ఆడిపోసుకున్నా

ముందు తరాలవారైనా సానుభూతి చూపిస్తే చాలు. అదుగో పిల్లలు జేల పడిపోతున్నారు. పిలవండి.

కుం:-నాయనా! ఇలారండి!

(నకుల, సహదేవ పరుగెత్తుకుంటూ వస్తారు)

మాద్రి:-(చేతులు జాపి) యిలారండి బాబూ!

నకుల, సహ:-(పరుగెత్తుకుంటూ పోయి) అమ్మా (కౌగిలించుకుంటారు)

మాద్రి:-బాబూ! (యిద్దరినీ తనివిదీరా హృదయానికి హత్తుకుంటుంది)

నకుల, సహ:-ఎందుకమ్మా ఏడుస్తున్నావ్?

మాద్రి:-లేదు బాబూ! ఏడవడంలేదు. ఇదిగో ఈవేళనుంచి మీకు కుంతి పెద్దమ్మే అమ్మ.

నకుల: మరి నువ్వు?

మాద్రి:-మనరుణం తీరిపోయింది బాబూ! నేను వెళ్ళిపోతున్నాను. ఆమె చెప్పిన మాటవిని మంచిపేరు తెచ్చుకోండి. మీ అమ్మకి మంచి పేరు తెండి.

నకుల, సహ:-అమ్మా! వద్దమ్మా!

మాద్రి:-అదే ఆఖరి పిలుపు నాయనా! ఇంకోసారి అనండి

నకుల, సహ:-అమ్మా! ఏమిటమ్మా!

మాద్రి:-అక్కా! పిల్లల్ని తీయండి అక్కా! ఆఖరిసారి ప్రార్థిస్తున్నా నా తప్పులన్నీ క్షమించండి. పిల్లలభారంమీదే. శలవు (నిష్క్రమిస్తుంది)

కుంతి:-(చెమ్మగిల్లిన కళ్లతో నకుల సహదేవులని అదిమి పట్టుకుంటుంది)

# తెల్లరోజా!

రచయిత్రి :
ఇన్‌గే షోల్స్

అనువాదము :
డాక్టరు వి. ఎస్. శర్మ

(గతసంచిక తరువాయి)

## చెల్లి కాలేజి చదువు

[ఆ రోజులు యుద్ధపురోజులు ఎక్కడ చూచినా సంక్షోభం. భౌతికంగా సంక్షోభం – అంతేనా ఇట్టి సంక్షోభాన్ని ప్రజాహృదయాల్లోకూడ చూడవచ్చు. అందరి కోరిక ఆ యుద్ధం త్వరలో ముగిసిపోవాలని. దానికంతా కారణభూతులైన వాళ్లంతా నామావశిష్టంకావాలని. ప్రజలు అనుకున్నంత సులభంగా అది పూర్తి అవుతుందా? త్యాగం అవసరం. ఆ త్యాగంలో ఆ పనిచేయదలచినవాళ్లు తమ ప్రాణాల్ని అదురూ బెదురూ లేకుండా సమర్పించాలి.

ఇట్టి త్యాగానికి ఆరోజుల్లో ముందంజవేసినవాళ్లు మ్యూనిచ్ నగరపు విద్యార్థులు, విద్యార్థినులూ. అంతేనా! ప్రొఫెసర్లు విద్యార్థులకి ఈ విషయంలో ఏమాత్రం తీసిపోయిన వాళ్లుకాదు. హాన్స్, అలెక్స్ (అలెగ్జాండర్) క్రిస్టల్ (క్రిస్టఫర్) ఈ ఉద్యమానికి నాయకులు. హాన్స్, చెల్లి సోఫీ కాలేజిలో చదువుకోటానికి మ్యూనిచ్ నగరానికి వచ్చింది. ఆ పిల్లకూడ వీళ్లకన్న రెట్టింపు వుత్సాహాంకల మనిషే. ఇలాటి విషయాల్లో వీళ్లంతా హాన్స్ గదిలో సోఫీ ఆ వూరికివచ్చిన సాయంకాలామే సమావేశమవుతారు. హాన్స్ ఆ సమావేశంలో తనకి ఎంతో నచ్చిన పద్యాన్ని వాళ్లకి చదివి వినిపించటానికి మొదలెడుతాడు. తరువాత కథను ఇక చదవండి...]

దేశం గొడ్డుపోయింది,
క్షోభపడుతున్నది ప్రజ......
ఇదే తన పనికి సమయం అనుకున్నాడు
చీకటి గుహలోనుంచి
బయటికి వచ్చిన దొంగ......

ప్రజల్ని కంగారుపెట్టి
వాళ్ల ఆస్తిపాస్తుల్ని దోచుకోనడానికి
నలువంకలా కలయచూశాడు.
మంచి అనుకూలం దొరికింది
ఆకులాగ అల్లాడిపోయింది జనం,

తగవులు పెట్టి తమాషా చూశాడు
అదేగా ఆ దొంగకి కావాలసింది
ఈ క్షోభలో,
ఈ దౌర్భాగ్యపు కాలంలో
తనే వాళ్ల ప్రవక్తనన్నాడు,
తనే వాళ్ల భాగ్య విధాతనన్నాడు,
తననే వాళ్లు సేవించాలన్నాడు
తన ఆజ్ఞని శిరసావహించాలన్నాడు
"నిరాకరించారా మట్టిపాలుగావాలి
ప్రతిఘటించారా పలాయనం కావాలి"
చాటించాడు దేశమంతటా.
ఇంకేం చేస్తుంది ఆ అమాయకపు ప్రజ,
తలవంచింది భయ భక్తులతో,
పొగడింది వేయినోళ్లతో
అతనే తమ ప్రవక్త అని,
అతనే తమ భాగ్య విధాత అని...
అదేగా అతను వాంఛించింది,
ఆ వాంఛ నెరవేరింది
గిర్రున త్రిప్పాడు కాలచక్రాన్ని,
గుంభనంగా సాగింది అతని పటాటోపం
అబద్ధాలపుట్ట అతనినోరు
అతని మాటా ఆదోవనే ఆరితేరినవాళ్లే
వాళ్లూ అధికారం చెలాయించారు
అభాగ్యులమీద, ఆ అమాయకులమీద.
ఇది ధర్మం, అది అధర్మం
ఇది రాజమార్గం, అది పెడమార్గం
నిర్ణయించారు వాళ్ల వాళ్ల పంథాల్లోనే.
చేశారు లెక్కలేనన్ని చట్టాల్ని
అదుపాజ్ఞల్లో వుంచారు చిన్న పెద్దల్ని
అవకాశవాదులు వున్నారు వాళ్లల్లో
చిచ్చు మొదలెట్టింది ఒక దొంగ
చిచ్చుని పూర్తిచేసింది ఈ అవకాశ
వాదులు
ఇంట్లో వంట్లో పెరిగినాయి వాళ్ల విష
బీజాలు
ఇండ్లకీ, వంట్లకీ ఎసరుబెట్టాయి ఆ విష
బీజాలు
అయోగ్యులు పెద్దలయ్యారు
యోగ్యులు పలాయనమయ్యారు
కుమిలిపోతూవుంది ప్రజ
ఎంతకాలం ఇలా ఆరటపడడం!
పుటుక్కున పడింది పిడుగు
భగభగ మండింది వాళ్ల యంత్రం
బూడిదపాలయింది ఆ యంత్రం
అదృశ్యమయ్యాడు నాయకుడు
పలాయనమయ్యారు అతని అనుచరులు
ప్రళయం వచ్చింది,
భూమి కంపించింది
ముంగేసింది ... ...
ప్పుడో జరిగింది యీ కథ
దాన్ని రకరకాలుగా మార్చింది
వాళ్లూ, వీళ్లూ దాన్ని చెబుకుంటూ
పిల్లలు విన్నారు దీన్ని ఆత్రంతో
అడవిలోకి గబగబ నడిచారు
కర్ర బొమ్మల్ని తయారు చేశారు,
గడ్డి బొమ్మల్ని సిద్ధం చేశారు

బ్రహ్మరాక్షసులని వాటికి పేరు పెట్టారు
ముస్తాబుచేశారు తనివితీరా వాటికి
తప్పట్లు వేస్తూ
నృత్యంచేస్తూ
ఆటలు ఆడారు, పాటలు పాడారు,
నిప్పు ముట్టించారు, బూడిదపాలు
చేశారు
ఆ కర్ర బొమ్మల్ని, ఈగడ్డి బొమ్మల్ని."

హాన్స్ గ్రుక్క తిప్పకుండా ఆ పద్యాన్ని వాళ్లకి చదివి వినిపించాడు. రాగయుక్తంగా చదివాడు. ఎంత ఆవేశాన్ని వుద్రేకాన్ని వాళ్ల ముందర చూపాడో ఆ పద్యాన్ని చదువుతూ ... వివరించడం అనవసరం.

దాన్ని వింటూ వాళ్లంతా దిగ్భ్రాంతులయి పోయారు. అలాంటి క్షోభని గురించి వాళ్లు నేడు కళ్లార చూస్తూనేవున్నారు. దానో వాళ్లకీ కొంత పాలు కూడావుంది. కాని ఎవళ్లు వ్రాసివుంటారు ఇంత ధైర్యంతో, సాహసంతో ఈ గాధని ? ... ఇంత వరకు చడీ చప్పుడూ చేయకుండావున్న క్రిస్టల్ "మంచి పద్యాన్ని చదివావు" అంటూ బిగ్గరగా అరిచాడు. అలెక్స్ వుద్రేకం ఇక చెప్పాలా ఆ పద్యాన్ని విన్నంతసేపూ! "ఇది వజ్రాలదండ. ఎక్కడ దొరికింది ఇంత మంచిదండ. హాన్స్ దీన్ని మన నాయకుడికి (హిట్లరుకి) అంకితం చేయటం సబబుగా వుంటుంది. వాళ్ల దినపత్రికల్లో దీన్ని అచ్చువేయటం మంచిదోయ్!" అంటూ హాన్స్ వీపుని ఆప్యాయంగా నిమిరాడు. చప్పట్లుకొట్టాడు. హాన్స్ చప్పునలేచి "నేను రాశాననిగా మీరంతా భ్రమ పడుతున్నారు. నాకు అంత శక్తి వుంటేగా! ... నూరేళ్ల క్రిందట దీన్ని గాట్‌ఫ్రీడ్ కెల్లర్ రాశాడు. మీ ధన్యవాదాలు ఆ కవికే అర్పించాలి ..." అంటూ ఆగాడు. ఏం ఆలోచించాడో ? "ఎవళ్లు రాస్తే మనకేం ? నేటి రాజకీయ వాతావరణాన్ని దీన్లో ఎంత చక్కగా వర్ణించారు ? కవికి ప్రతిఫలం ఈయకుండానే మనం దీన్ని యథేచ్ఛగా వుపయోగించుకోనవచ్చు. కాపీలనితీసి దేశమంతటా పంచి పెట్టితిమా ఎంత బాగా వుంటుంది !". తన బుర్రలో రేకెత్తిపోతూవున్న ప్లాన్లని వాళ్లకి చెప్పాడు హాన్స్.

సోఫీ దీన్ని వింటూ ఈ లోకాన వుంటేగా ? దాని బుర్రలో ఎన్నెన్నో ఆలోచనలు ఆ సంఘటనను తన మనో ప్రపంచంలో చూస్తూ వున్నంత కాలం ! అదీ హాన్స్‌ప్లాన్లని అంగీకరిస్తూ, ఆ పనికి తానూ తోడ్పడడానికి సిద్ధంగావున్నానని చెప్పింది. ఆ రాత్రంతా హాన్స్, సోఫీ, క్రిస్టల్, అలెక్స్ ఆలోచించారు ఆ పద్యాన్ని ఎలా కాగితాలకి నింపటం, అలా తయారుచేసిన కాగితాల్ని దేశమంతటా ఎలా పంచిపెట్టడం! ఆ పనిలో మునిగిపోయాక వాళ్లు వాళ్ల ఇరుగు పొరుగుల సంగతే పూర్తిగ మరచిపోయారు. రాత్రి దొర్లుకుని పోతూవున్నదనే సంగతి వాళ్లకి తెలుస్తేగా ! అర్ధరాత్రి అయింది. ... కోడికూసింది, తెల్లవారింది, ... కాని వాళ్ళకి ఇదీ ఆ వుద్రేకంలో, ఆ ఆవేశంలో అవగాహనమైతేగా ! ...

## II

సోఫీ విశ్వవిద్యాలయంలో చదువు ప్రారంభించింది. విశ్వవిద్యాలయంలో ఎంతోమంది విద్యార్థులు వున్నారు. జర్మను దేశంలోని అన్ని ప్రాంతాల నుంచి వచ్చినవాళ్లువున్నారు. జర్మను భాషనుమాట్లాడే ఇతర దేశాలనుంచి వచ్చిన విద్యార్థులూ ఎంతోమంది అక్కడ వున్నారు. అంతేకాదు. ఇతర ఖండాలనుంచి వచ్చి తమ అభిమాన విద్యల్లో పాండిత్యాన్ని సంపాదించుకోనడానికి తయారైనవిద్యార్థులు అసంఖ్యాకులుగావున్నారు. ప్రొఫెసర్లు నిరాడంబరమైనవాళ్లు. వాళ్ళ వాళ్ళ శాస్త్రాల్లో లోతుపాతుల్ని గూఢంగా చదివినొన్నవాళ్లు, వినయ సంపన్నులు, ఉదార స్వభావులు. అట్టి విద్యా వినయ సంపన్నుల దగ్గర శుశ్రూష చేసుకోనడానికి అవకాశం దొరకటం ఈ విద్యార్థుల అదృష్టమనే చెప్పవచ్చుగా !

అవి యుద్ధపు రోజులు. ప్రజాకోటి తిండీ తిప్పలూ లేక మలమల మాడిపోతూవున్నారు ఒక వైపున. మరియొకవైపున ఆ కాలపు రాజకీయ వాతావరణం జనాన్ని పెడుతూవున్న తికమకలు ఇక చెప్పటం అనవసరం. అటు గోయి. ఇటూ నుయ్యి. రెంటికీ మధ్య యమయాతనలని బడుతూవున్న ప్రజల్ని అర్థంచేసుకుని వాళ్ళకి ఒక దారీ తెన్నూని చూపెట్టడానికి ఆ కాలాన ముందంజవేయటానికి ఎవళ్ళకి ధైర్యంవుంది! సాహసంవుంది!

సోఫీ మ్యూనిచిక్ వచ్చాక అక్కడి వాతావరణాన్ని అర్థంచేసుకోనడానికి ఎంతో ప్రయత్నం చేయసాగింది. ఈ విషయంలో సోఫీ అన్న హాన్స్, హాన్స్ మిత్రులు, క్రిస్టల్, అలెక్స్ ఆ పిల్లకు శాయశక్తులా సహాయం చేయసాగారు. వాళ్లు ప్రతి రోజూ వాళ్ళకి తీరికవున్న సమయంలో చేస్తూవున్నపని ఇదేగా. ఆ నగరంలో ఆస్పత్రులు ఎన్నో వున్నాయి. వాటిలో ప్రభుత్వంవారిచే నడుపబడుతూవున్న ఆస్పత్రులువున్నాయి. డాక్టర్లు వాళ్ళ వాళ్ళ స్వంత బాధ్యతలమీద నడుపుతూవున్న వైద్యాలయాలూ ఎన్నో వున్నాయి. రోగులతో అన్నీ నిండిపోయాయి. మందు మాకులు లభించటం కష్టం. అథవా లభించినా అన్నీ యుద్ధ భూములకి పంపాలి. అంచేత తగినంత వైద్య సహాయం లేనందున రోగులు పడుతూవున్న బాధ చెప్పతరంకాదు. హాన్స్ జట్టు ఇలాటి వైద్యాలయాల్ని ప్రతిరోజూ చూస్తూ వుండేది. రోగుల దగ్గర కూచుండి వాళ్ళ యోగక్షేమాల్ని విచారిస్తూవుండేది. వాళ్ళకి తమ చేతనైనంతవరకు సహాయం చేస్తూ వుండేది.

సోఫీతో హాన్స్ ఒక రోజున ఆస్పత్రులను గురించి, అక్కడి రోగులను గురించి ఎన్నో విషయాల్ని చెప్పాడు. "రోగులు మా కోసం ఎంతో కలవరిస్తూ వుంటారు. మేము వాళ్ల మంచాల దగ్గరకు రావటం వాళ్లు చూశారా, వాళ్ళ సంతోషాన్ని పట్టటానికి పగ్గాలు అవసరమా? తమ సొంత మనుషులకి మల్లే మమ్మల్ని ఆదరిస్తూ తమ కష్ట సుఖాల్ని మాతో చెబుతూ వుంటారు. అంతేనా? వాళ్ళని కలవరపెడుతూవున్న ఆర్థిక రాజకీయ సమస్యలని చనువుతో మాకు చెప్పుకుంటూ వుంటారు. మేము వాళ్ళకి క్రొత్త వాళ్ళం. ఈ రోజుల్లో అలా చనువిచ్చి వాళ్లు మాట్లాడంచూస్తే మాకే ఆశ్చర్యం వేస్తూ వుంటుంది. ... వాళ్లు చెప్పే సంగతులు ప్రభుత్వం వారికి తెలిసాయా - కొంప మునిగిపోతుంది. ప్రాణంతో ఇళ్ళకి తిరిగి వెళ్ళడానికే వీలుంటుందా!... అయినా భయం అనే మాట ఏకోశానావుంటేనా - యుద్ధరంగంలో మృత్యుదేవతని ఎదుర్కొని హోరాహోరిగా ఆ దేవతతో పోరాడినవాళ్ళు ఈ చిన్న దేవతల తాండవానికి వాళ్లు భయపడేవాళ్లా? ... వాళ్ళలో ఒకాయన మమ్మల్ని చూసి పలకరించాడు. కొంతసేపు మా తత్వాన్ని తెలుసుకోనడానికి కాబోలు ఆ సంగతీ, ఈ సంగతీ చెబుతూ కాలక్షేపంచేశాడు. తరవాత ఏమనుకున్నాడో ... మాకేసి వుద్రేకంతో చూసి "మన వాళ్ళంతా ఒక వైపున ప్రభుత్వంతో, ఇంకొక వైపున యుద్ధ దేవతతో అహోరాత్రాలూ పోరాడుతూ యమయాతనల్ని పడుతూవున్నారు ... ఇక మీరో? హాయిగా మీ గదుల్లో కూర్చుంటున్నారు. క్లాసు రూముల్లో ప్రొఫెసర్లు చెబుతూ వుండేవాటిని వింటూ వూకొడుతూ వున్నారు. తిండీ తిప్పలు విషయం మీకే మాత్రం బెంగలేదుగా! ... మీ వాలకం చూస్తూంటే నాకే వింతగా వుంది? ... ఈ విషయాల్లో అదురూ బెదురూ లేకుండా మీరూ కలుపుకోవాలి. అగాధ సముద్రంలో మునిగి తేలుతూ వుక్కిరి బిక్కిరి అయిపోతూవున్న చిన్నల్ని పెద్దల్ని ఒక ఒడ్డుకి చేర్చటానికి మీరంతా ముందంజ వేయాలి. అప్పుడే ప్రభుత్వం ప్రజానీకపు శక్తిని అవగాహనం చేసుకుంటుంది. ..." అంతేకాదు ఆయన అన్నది! "మన శక్తిని అర్థంచేసుకోనడానికి ప్రభుత్వానికే ధైర్యంలేకపోయిందా, ఆ ప్రభుత్వాన్నే ప్రతిఘటించటానికి మీ వంటి యువకులు సిద్ధంగా వుండాలి. ఆ పనిలో ఎట్టి కష్టాల్ని ఎదుర్కొనవలసివచ్చినా, తటపటాయించక, వాటికి తయారుగా

(344-వ పేజీ తరువాయి)

అంటే సుందరమ్మకు కన్నకొడుకుమీదకన్నా యెక్కువగా వాత్సల్యం వుంటూ వుండేది. రఘునాథం యింకా రెండు సంవత్సరాలకు దత్తత వస్తాడనగా కుటుంబరావు పెళ్లాం నాగలక్ష్మి పక్షవాతంవచ్చి చచ్చిపోయింది. వదినపోయిన నాటినుంచి, వరుసకు మేనత్త అయినా, రఘునాథం "అత్తయ్యా" అని పిల్చినప్పుడు సుందరమ్మకు మాతృత్వం పొంగి పొర్లి కట్టలుదాటేది. కుటుంబరావుకి నాగలక్ష్మి పోయిన నాటినుండీ అదో తరహాగా వుండటం అలవాటయింది. బుద్ధి కుదిరినప్పుడు యింటిపట్టున వుండటం, వేళ గాని వేళల్లో, లేనిపోయిన ఆలోచనలతో భోజనం ముందు కూర్చోవటం, ఎవరేంచెప్పితే అది వింటం, మొదలుపెట్టాడు. రఘునాథంకి యీ ప్రవర్తనంతా ఆయేడు కాయేడు పైబడుతున్నకొద్దీ అర్థమవుతూ వచ్చింది. కుటుంబరావుకి, రఘునాథంకి యింత వండిపెడుతూ, తనకున్న యిద్దరాడపిల్లల్నీ చదివించుకొంటూ కాలక్షేపం చేస్తున్న రోజుల్లో, సుందరమ్మ భర్త కామేశ్వరరావు మదనపల్లివద్ద జరిగిన రైలు ప్రమాదంలో మరణించాడు. రఘునాథంకి పరిస్థితులు యీ సారి బాగా అర్థమయినాయి. ఇటు తండ్రిస్థితి చూడబోతే చీట్లపేకలో సర్వాస్తిని పోగొట్టే సూచనలు కనిపిస్తున్నాయి - చేరిన స్నేహితులు అంతా జూదరిగాళ్లే. ఒక్క క్షణంసేపుకూడా యింటిపట్టున వుండనీయకుండా, బెల్లంచుట్టూ యీగలు మూగినట్లు మూగుతూంటారు. కుటుంబ యోగక్షేమాలు - ఆస్తివ్యవహారాలు గురించి మంచీ చెడ్డలు ప్రస్తావిద్దామంటే వీలుదొరక్కుండా పోతున్నదని అంతరాత్మలో ఆవేదన, అటు చూడబోతే తల్లి కన్న యెక్కువగా పెంచి, పెద్దచేయతల్చుకున్న సుందరమ్మత్తయ్య, కాపురంలోని చీకటితెరలు, యివన్నీ రఘునాథంని పిచ్చివానిగా చేస్తున్నయి. నిండుకుండలాంటి మనిషి కాబట్టి రఘునాథం యీ గడ్డు సమస్యలన్నిటికీ తలవంచుతూ, మంచి సమయంకోసం వేచి వుంటున్నాడు. సుందరమ్మ సంసారానికి కావలసిన సౌకర్యాలన్నీ తనే సమకూరుస్తున్నాడు.

రఘునాథంమీద సుందరమ్మకి యింత మమకారం గల్గడానికి కారణం? "తనకు కావలసిన వసతులన్నీ, అతని ఆస్తిలోంచిపొంది, వున్న యిద్దరి కూతుళ్లను పెద్దచేసి చదువు చెప్పించి, వీలయితే రాగమయినిచ్చి పెళ్లిచేసి తన కుటుంబాన్ని బాగుచేసుకొందామనే ఆశతో సుందరమ్మ అంటిపెట్టుకొనివుందా!" అని ఆ వూరివారంతా పరిష్కారం చేస్తున్న రోజుల్లో ఒకనాడు, కుటుంబరావు అయిదువందల రూపాయలు గురవయ్యగారి యెడ్లసావిడిలో చీట్లపేకలో పోగొట్టుకొని, కనుచీకటిపడుతూండగా యింటి మలుపులోకిరాగానే యెక్కణ్ణుంచో వూడిపడినట్టు వచ్చాడు గిరిరాజు మామూలుకు. కుటుంబరావు తలవంచుకొని తూలుతూ వీధితలుపుతోస్తూ, "యివ్వాళంతా పోయిందిరా! రేపిస్తాలే" అని గొణిగాడు.

గిరిరాజు ఆ వూళ్లో చీట్లపేక ఆడేవాళ్లందరికీ జ్యోతిష్యంలాంటిదిచెపుతూ, అవసరమైతే ఆట మధ్యలో కాఫీలు - సిగరెట్లు అందిస్తూ, ఆట దగ్గరకు యితరులెవ్వరూ రాకుండా కాపలాకాస్తూ, ఆటముగిసిన తరువాత, అందరి దగ్గరా పావలా - అర్ధా మామూలుగా అడిగి పుచ్చుకొని బ్రతికే యీనాదివాడు.

గిరిరాజుకి కోపంవచ్చింది.

కుటుంబరావు తలుపు దగ్గరగావేసి అవతలవైపు ఆనుకొనివున్నాడు.

"వారం రోజుల్నుంచి ఎగేస్తున్నారు దొరా! న్యాయంలేదు. జేబులో యెంతవుంటే అంతే యివ్వండి! మిగతాది తర్వాత యిద్దురుగాన్లే" అన్నాడు.

కుటుంబరావుకి వినిపించీ వినపించకుండా వినిపించాయి ఆ మాటలు.

"నీకాక్కాదురా చెప్పేది. లేవంటల్లా! గొడవ సేయకు ... అవతలికిపో ... రేపు కనిపించు" అన్నాడు కుటుంబరావు.

గిరిజాబా పఱుగుతూ వెళ్ళిపోయాడు అక్కడ నుంచి బయలుదేరి తూలుతూపోయి నూతిగట్టు చాపుల్లో వున్న అరుగుమీద కూర్చొని అంచేత్తో గుండెను నొక్కుకొంటూ ఘోరంగా దగ్గుతూండగా, సుందరమ్మ "ఎవరా మనిషి దగ్గేది" అని ఆశ్చర్యంతో లాంతరు పుచ్చుకొని, చీకటిని చీలుస్తూ నూతి దగ్గరకు వచ్చింది.

కుటుంబరావు పైపంచతో నోరు మూసుకొని దగ్గుతున్నాడు. లాంతరక్కడే పెట్టి మంచి నీళ్లు తేబోయింది. రఘునాథం ఆరోజున వూళ్ళో లేడు. శ్యామసుందరి, రాగమయి కిటికీదగ్గరకొచ్చి —

"అక్కా! యేమిటో వాసనొస్తోందే" అంది రాగమయి.

"ఏమీలేదుగాని, నువ్వావులో వెళ్లాయి" అంది శ్యామసుందరి.

"ఏమీలేదంటావేమిటి? అంగా వస్తూంటే!"

"అబ్బ! ... నువ్వు గొడవచేయబోకే!"

ఇంతలో సుందరమ్మ మంచి నీళ్లు చెంబుతో అందించింది. కుటుంబరావు ఒక గుక్కెడు పుక్కిలించి వుమ్మేశాడు. మరో గుక్కెడు తాగేడో లేదో, వెంటనే వాంతిలాగా రక్తంతోకలిసి వచ్చేసింది. ఏదో అది చెడువాసన. పులిసిన మజ్జిగ కంపు గబ్బుగా కొడుతూవుంది.

సుందరమ్మకు, కుటుంబరావు కక్కిన రక్తం చూడగానే గుండె బేజారెత్తింది.

"అన్నయ్యా! మంచంవేస్తాను. యిలావచ్చి పడుకో" అంది సుందరమ్మ.

కుటుంబరావు యేంమాట్లాడలేదు. దగ్గు తెరలు తెరలుగా వస్తోంది. కిటికీలోంచి ఆ దృశ్యం చూడలేక శ్యామసుందరి, రాగమయి లోపలికి వెళ్ళిపోయారు. సుందరమ్మకు కుటుంబరావు పరిస్థితి చూస్తూంటే నవనాడులూ క్రుంగిపోతున్నట్లనిపించింది. కుటుంబరావుకి గుండెదడ యెక్కువయింది. సుందరమ్మకు ముచ్చెమటలు పోస్తున్నయి. దగ్గిదగ్గి మొగమంతా కందగడ్డలాగా యెర్రబారింది కుటుంబరావుకి. కళ్ళల్లో యెర్రచారలు మామూలుకన్నా యెర్రగా కనిపిస్తున్నాయి. తడిసిన చొక్కాలోంచి శరీరం చెమటకంపుకొడుతోంది. దగ్గు తెరలు తీవ్రంగా వస్తుంటే సుందరమ్మ చెవులుమూసి, దుర్గంధభూయిష్ఠమైన రక్తాన్ని కక్కిస్తోంది. ఒళ్ళంతా అపరిమితమైన వేడితో సెగసల కాగిపోతోంది. క్రమేపి కక్కిన రక్తంమీద యిసుక చల్లడానికి వచ్చిన పాలేరు బిచ్చాల్ని పొరలు కప్పకొన్న కళ్ళతోచూసి "రఘూ!" వచ్చాడా అని అడిగాడు. సుందరమ్మకు హృదయంలో దేవినట్లయింది. కళ్ల నీరూరింది.

"ఇంకా రాలేదురా! రఘూ" అంది.

చుట్టుప్రక్కలవాళ్లలో అప్పటికే యిద్దరు ముగ్గురు చూడడానికివచ్చారు. రఘునాథంకోసం శ్యామసుందరి, రాగమయి, సుందరమ్మ ఎదురుచూస్తున్నారు. ఆఖరు బస్సుకూడావచ్చి హారన్ మ్రోగించి వెళ్లినా రఘునాథంరాలేదు.

కుటుంబరావుకి వాకిటి వసారాలో మంచంవేసింది సుందరమ్మ. వచ్చి మెల్లగాపడుకున్నాడు. ఆకాశం వంక చూద్దామని ప్రయత్నిస్తున్నాడు. కాని చుట్టూ ఆవరించుకొన్న అమావాస్య చీకటి అతని కనురెప్పల్ని మూసేస్తోంది.

సుందరమ్మ వాకిటి గుమ్మానికి దగ్గరగా కుటుంబరావుకి వుపచర్యలుచేయు నిమిత్తం పమిటచెంగు పరుచుకొనిపడుకొంది. శ్యామసుందరి, రాగమయి ఆపూట అన్నంతినడానికి మనసొప్పక వూరికే మధ్యయింటిలో పడుకొనివున్నారు. గాలికి తలుపుచప్పుడైనప్పుడల్లా "రఘునాథం వచ్చాడేమో" అని శ్యామసుందరి, తడబడుతూండేది. రాగమయికి "దబ్బున వస్తే బాగుండు"ననిపిస్తూండేది.

పగలలా చాకిరీచేసిన అలుపుమీద సుందరమ్మకు కునుకుపట్టీ పట్టనట్లు పట్టింది.

"కామేశ్వరరావు చనిపోయిన రైలు ప్రమాదంలోని దృశ్యాలన్నీ కళ్లల్లో కనిపించాయి. పెట్టెలన్నీ రైలు పట్టాలకు దూరంగా దొర్లుకుపోయి తునాతునకలైవున్నాయి. (సశేషము)




## లక్ష్మీ ప్రొడక్షన్స్ వారి : 'ఇలవేలుపు'

ప్రస్తుతము సంఘములో జాతీయ భావాలను, ఉత్తమమయిన నైతికస్థాయిని, వాస్తవిక పరిజ్ఞానము ప్రబోధించుట కనువుగా తయారయిన చిత్రము 'ఇలవేలుపు'.

కథ కొద్దిగా గజిబిజిగానున్నా రసవంతంగా, సాఫీగా నడపటంవలన, మాటలు, పాటలు సమయోచితంగా నుండుటవలన బాగా రక్తి కట్టింది.

ముఖ్యంగా ప్రకృతి చికిత్సలాంటి ఉత్తమోత్తమ విధానము, పొగత్రాగుడు, మద్యపానములాంటి దురలవాట్లవలని అనర్థాలను ప్రబోధించింది చిత్రము. పవిత్రప్రేమ, త్యాగముల స్వరూపాలు బహు చక్కగా చిత్రించబడినవి.

అంజలీదేవి, నాగేశ్వరరావుల నటనా కౌశలము అమోఘంగా నుండింది. ముఖ్యంగా అంజలీదేవి మాతృమూర్తిగా పాత్రలో లీనమై నటించింది.

రేలంగి హాస్యంతోబాటు మొత్తంమీద నటీనటులందరు చక్కగా నటించారు.

సంగీతము హాయిగా నుండినది.

ఈ చిత్రమును అత్తకోడళ్లు, ఆడబిడ్డలు, గయ్యాళి భార్యలు చూచి ఆత్మ పరిశీలన చేసికొని తమ నడవడిని సరిదిద్దుకోడానికి అవకాశాలు చాల యున్నవి.

ఈ చిత్ర నిర్మాణం డైరెక్టరు యోగానంద్ గారికి అఖండ కీర్తి ప్రతిష్ఠల నార్జించి పెట్టినది. విజ్ఞాన వినోదాలు సమపాళ్లుగా నున్న 'ఇలవేలుపు' చిత్రం ప్రజా సామాన్యపు మన్ననల నందుకోగలదని గట్టిగా చెప్పవచ్చును.

♦ ♦ ♦

## నాగయ్యగారి : 'రామదాస్'

శ్రీ నాగయ్యగారి 'రామదాస్' చిత్రానికి గౌరవనీయులు శ్రీ పి. వి. రాజమన్నార్ గారు వీనస్ స్టూడియోలో ప్రారంభోత్సవము చేశారు.

వేదమంత్ర పూజార్చనలమధ్య జరిగిన ప్రారంభోత్సవానికి అనేకులు నటీనటులు, పత్రికా రచయితలు, చలనచిత్ర నిర్మాతలు వచ్చారు.

శ్రీ నాగయ్యగారు తమ 'రామదాస్' చిత్రములో నటింపనున్నవారిని, తనకు చిత్ర నిర్మాణములో సహాకరింపనున్నవారిని సభికులకు పరిచయము చేసే ముందు తానెప్పుడు నటుడుగానే యుండగోరుచున్నాననియు, తాము నిర్మిస్తున్న యీ చిత్రాన్ని శ్రీ బళ్లారి రాఘవాచారిగారికి అంకితము మివ్వనున్నానని చెప్పి, తానిక నిర్మింపనున్న ప్రతి చిత్రాన్ని నాట్యకళ నారాధించి, ఉత్తమోత్తమ నటుడనిపించుకున్న వ్యక్తికి అంకితమివ్వనున్నాననిరి.

ఈ చిత్రంలో నాగయ్య, కన్నాంబ, గౌరీనాథశాస్త్రి, రామశర్మ మొదలగువారు నటించుచున్నారు. నాగయ్యగారు డైరెక్టుచేస్తూ రామదాసుగాను, కన్నాంబ రామదాసు భార్యగాను నటించెదరు.

'సిట'

# బంగారు తిమ్మరాజు కథ

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

—(౦)—

(గతసంచిక తరువాయి)

విజయనగర రాజ్యానికి అసలు చక్రవర్తి సదాశివరాయలు. అతను అతని సోదరుడైన తిరుమల రాయలచేత చెరలో ఉంచబడ్డాడు కదా! బలహీనుడైన సదాశివరాయలను తుదముట్టించినవాడు రెండవ వేంకటపతిరాయలు. ఇతను రాజ్యానికి వచ్చిన పిమ్మట కప్పం కట్టడం మానివేసిన పాళెగాండ్రను లొంగదీసేడు. రాజధానియైన పెనుగొండను ముట్టడించిన గోల్కొండ సుల్తానును జయప్రదంగా తరిమివేసేడు. ఈ మహారాజు పండితుడై కళలను ఆదరించేడు. అన్ని భాషలను సమంగా చూసేడు. మధురలో స్థాపించిన కళాశాలలో పది వేలమంది విద్యార్థులుండేవారు. ఇతను పోర్చుగీసు వారితో స్నేహం చేయగా వారు ఆ అవకాశాన్ని పురస్కరించుకొని మత ప్రచారం చక్కగా చేసుకొన్నారు.

రాయలకు ఆరుగురు భార్యలు. వీరిలో ఇద్దరు గొబ్బూరి ఓబరాయడి కుమార్తెలు. రాజుతోగల బంధుత్వాన్ని ఆధారపరచుకొని ఓబరాయడు రాజకీయాలలో ప్రవేశించి అతి దుర్మార్గంగా వ్యవహరించేడు. దృఢమైన మనస్సులేని రాజు భార్యాలోలుడై, ఓబరాయడు ఆడించినట్లల్ల ఆడేడు. ఓబరాయడికే క్రైస్తవ మతాచార్యులు లంచాలిచ్చి తమ పని కావించుకొనేవారు. ఓబరాయని కొమార్తెయైన కొండమాంబిక అన్నకి తగిన చెల్లెలు అవడంచేత రాచకీయాలలో కైకేయిలాగు ప్రవర్తించింది. తండ్రి కుమార్తెలు విధ్వంసానికి అగ్నివాయువులలాగు అనుకూలపడ్డారు. రాజుయొక్క గౌరవం, అధికారం నశించేయి. రాజ్యం కూలడానికి సిద్ధమయింది.

మహారాజుకి సంతానం మాత్రంలేదు. పట్టపురాణి గర్భవతిగా నటించి ఎక్కడినుండో ఒక కుర్రవాణ్ణి తెచ్చింది. కాని మిగతావారు ఆ కుర్రవాడికి ఏ హక్కూ ఈయలేదు. మహారాజు అనంతరం రాజ్యానికి హక్కుగలవాడు ఆయన పెద్దమేనల్లుడైన తిమ్మరాజు. అతను పరిపాలనా చాతుర్యం కలవాడు. కాని మహారాజుకి మాత్రం అతనంటె కిట్టదు కాబట్టి తిమ్మరాజు తమ్ముడైన రంగరాజుకి 'నాకు రాజ్యం వద్దు మొర్రో' అంటూంటె రాజ్యాన్ని కట్టబెట్టేడు. దానితో అంతః కలహాలు బయలుదేరేయి. ఇట్లు వేంకటపతి, విజయనగర రాజ్యం క్షీణించడానికి అవసరమైన పనులను చేసేడు.

## కవి ; రచనాకాలం

ఈ కథయొక్క అవతారిక దొరకలేదు. కాబట్టి కవి పేరు తెలియదు.

ఈ రకం జంగంకథలకు చారిత్రకాంశాలు నిజంగా జరిగిన కాలం, దాని రచనాకాలం చెప్పతగినంత దూరంగా ఉండవు.

రాయలు పెనుగొండలో ఉంటూండగానే కథ జరిగిందని జంగంకథలో చెప్పబడింది. విజయనగర రాజ్యానికి పెనుగొండ రాజధానిగా 1565 నుండి 1592 వరకు ఉంది. ఈ కాలంలో ముగ్గురు రాజులు పరిపాలన చేసేరు. (1) తిరుమల రాయలు (2) గంగ రాయలు (3) వెంకటరాయలు. జంగంకథలో రాయలకి పుత్రసంతానంలేదని చెప్పబడింది. తిరుమల రాయలకు నలుగురు కొమార్లు ఉన్నారు. కాబట్టి అతను కాడు. అటుతర్వాత పరిపాలించిన రంగరాయలకి, వెంకటరాయలకికూడ సంతానం

లేదు. కాబట్టి వీరిద్దరిలో ఒక్కరే జంగంకథలో చెప్పబడినవారని చెప్పవచ్చు. రంగరాయల అనంతరం రాజ్యానికి హక్కుదారుడు రంగరాయలి మొదటి తమ్ముని కుమారుడు, కాని రంగరాయని రెండో తమ్ముడైన వేంకటరాయలు కాదు. అయినప్పటికి వేంకటరాయలు సింహాసనాన్ని ఆక్రమించుకొన్నాడు. అతనికికూడ సంతానంలేదు. రాజ్యం సహజంగా రావలసిన తిరుమలరాయునికి (రంగని పెద్దకుమారుడు), వేంకటరాయలకును మనస్పర్ధలు ఉండడంలో విపరీతంలేదు. అటుతర్వాతనైను వేంకటరాయలు తిరుమలరాయల తమ్ముడైన రామరాయలను (ఇతని పేరే ముజుందారుగారు ఇచ్చిన వంశవృక్షంలో రంగరాయలని ఉంది) దత్తత చేసుకొన్నాడుకాని తిరుమల రాయణ్ణికాదు. మన జంగం కథలో చెప్పబడ్డ బంగారు తిమ్మరాజు ఈ తిరుమల రాయడే అని చెప్పవచ్చు. ఈ కథా కాలం నాటికి వేంకటరాయలు జీవించి ఉన్నాడు కాబట్టి ! ఈ కథ, 1586 (అనగా, వేంకటరాయలు సింహాసనమెక్కిన సంవత్సరం) 1592 (అనగా, పెనుగొండ ముఖ్యపట్టణంగా ఉండిన ఆఖరు సంవత్సరం) మధ్య జరిగుండవచ్చు.

వచనకథయైన బంగారు తిమ్మరాజు కథ తంజావూరి సరస్వతీ మహలు పుస్తక భాండాగారంలో 283 వ పుటలో ఉంది. దానిలోకూడ పెనుగొండలో రాయలు అనే చెప్పబడింది. కాబట్టి పెనుగొండ ముఖ్యపట్టణంగా ఉండిన సమయంలోనే ఈ కథ జరిగుండవచ్చు. (సశేషము)




**భారతజాతీయ జండా (చరిత్ర)** : శ్రీ పింగళి పరశురామయ్యగారు, గోపాలరెడ్డి రోడ్డు, బకింగ్‌హాం పేటపోస్టు, విజయవాడ 2. వెల 0-8-0.

ఇందులో 'జాతీయ పతాక ఆవశ్యకత' శీర్షికతో ప్రారంభమయి 1905 సం॥నుండి 1947 స్వాతంత్ర్య సిద్ధివరకుగల జాతీయపతాకచరిత్ర వివరింపబడింది.

మొట్టమొదటిపతాకయొక్క స్వరూపం, దరిమలా దాని రూపంలో వచ్చిన మార్పులు, దానిక్రిందసాగిన ఉద్యమాలు, వీరోచిత పోరాటాలు, చేసిన త్యాగాలు వివరించబడినవి. స్వాతంత్ర్యసిద్ధితో రూపొందిన జాతీయపతాక స్వరూపము, దాని విశిష్టత, దానిపట్ల ప్రజానీకం చూపించవలసిన భక్తిగౌరవాలు, దానిని ఉపయోగించుకునే విధాలు, వివరించబడినవి.

ప్రతి దేశానికి పతాకం స్వాతంత్ర్య చిహ్నము. వ్యక్తిత్వాన్ని, పేరుప్రతిష్టలను ఖండఖండాలలో వ్యాపింపజేయునది యీ పతాకమే.

ఈ చిన్న పుస్తకంలో భారతజాతీయజండాచరిత్ర సమగ్రంగా, ఉపయుక్తంగా వివరించబడియున్నది.

♦ ♦ ♦

'వనిత' మాసపత్రిక ఏప్రెలు, మే సంచికలు మా కార్యాలయమునకు చేరినవి. సంపాదకురాలు శ్రీమతి అబ్బూరి ఛాయాదేవి, యం. ఏ. కార్యాలయము: ఆంధ్రయువతీ మండలి, హైదరాబాదు.

సంచికలు ముచ్చటగా అమూల్యమైన రచనలతోటి, చిత్రములతోనున్నవి. ముఖ్యంగా మహిళాభ్యుదయాన్ని ప్రోత్సహించే వ్యాసములు అనేకములు కలవు.

వాస్తవికత కనుగుణ్యంగా జాతీయదృష్టితో మహిళల అభ్యున్నతికి యీ పత్రిక అనేక విధాల తోడ్పడగలదని ఆశిస్తున్నాము. వెల విడిపత్రిక 0-4-0

**కమ్యూనిస్టుల ప్రజాసేవ** : శశీ - కాంత్, సంస్కృతి ప్రచురణ. వెల 0-4-0

కమ్యూనిస్టులు ఎప్పటికప్పుడు విధివిరామంలేకుండా ప్రచారంచేస్తున్న అసత్యాలను, వారి అమానుష ప్రవర్తనను వ్యక్తముచేయుటము యీ చిన్న పుస్తకముయొక్క ఉద్దేశము.

ఇందులోని రచన వాస్తవికత కనుగుణ్యంగా సాగినది. కమ్యూనిస్టుల బూటక ప్రచారమును నమ్మి తప్పుదారులలో పడబోయే ప్రజాసామాన్యానికి కనువిప్పు కావడానికి యిందులో రుజువైన వాస్తవిక విషయాలు పొందుపరచబడినవి. కమ్యూనిస్టుల ఘాతకకృత్యాలు యీ చిన్న పుస్తకంద్వారా కొన్నిటిని తెలిసికోవచ్చును.

---

## ఆదర్శ వివాహము

వరకట్నాలకు అతీతంగా మచిలీపట్నంలోని జగన్నాథ పురంలో శ్రీ మల్లాప్రగడ సత్యనారాయణ గారి కుమారుడు చి॥ వెంకట హనుమంతరావుగారికిని, శ్రీ మోపిదేవి నాగభూషణరావుగారి ఏకైక పుత్రిక చి॥ సౌ॥ సత్యవతికిని స్త్రీహూలతపరకట్న నిర్మూలనశాఖవారి ఆధ్వర్యమున జూలై 1-వ తేదిన వివాహము జరిగెను. పలువురు ప్రముఖులు ఆశీర్వదిస్తూ శుభసందేశములను పంపిరి.

వరకట్నాల నిర్మూలనకుగాను యీ శాఖ చేయుచున్న కృషికి తోడ్పడమిచ్చిన నూతన దంపతులకు వారి తల్లిదండ్రులకు మా అభినందనలు.

---

# సంపాదకీయములు

## శ్రీ బులుసు సాంబమూర్తిగారి 71 వ జన్మదినోత్సవము

మహర్షి సాంబమూర్తిగారికి డెబ్బైఏళ్లునిండి 71 వ జన్మదినోత్సవము జరిగిన సందర్భమున యావద్భారతము, ముఖ్యంగా ఆంధ్రదేశము జాతీయ సమరచరిత్రను ఒక్కసారి వెనుకకు తిరిగిచూచుకొనవలసియున్నది.

మన దేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించడానికి మహర్షిలాంటి అతిరథమహారథులైనట్టి జాతీయయోధుల ధైర్యసాహసాలు, స్వార్థరహితమైన త్యాగము కారణము.

శ్రీ సాంబమూర్తిగారికి ప్రజాహితముపట్ల ఎంత ఆసక్తియుండినదో ఆయనలోని ఆత్మ విశ్వాసం సయితము అంత గొప్పది. కాబట్టే ఆయన తలపెట్టి నాయకత్వము వహించిన ప్రతి ఉద్యమము విజయవంతము కాగలిగినది.

స్వాతంత్ర్య ఉద్యమమేకాదు ఆంధ్రరాష్ట్రోద్యమంలోసయితము శ్రీ సాంబమూర్తిగారు నిర్వహించిన పాత్ర చిరస్మరణీయమైనది. మద్రాసు నగరంలో ఆంధ్రులకు న్యాయంకలుగాలని ఆంధ్రమహాసభద్వారా నిర్విరామంగాచేసినకృషి అపారము.

మహిళా అభ్యుదయంపట్ల, అభివృద్ధిపట్ల శ్రీ సాంబమూర్తిగారికిగల ఆసక్తి ఎక్కువ.

వీటితోబాటు వారికిగల రాజకీయ పరిజ్ఞానము, అనుభవవిశేషాలను యీనాటి యువకనాయకత్వము వినియోగించుకుంటే మార్గదర్శకముగా నుండగలదు.

శ్రీ సాంబమూర్తిగారి వ్యక్తిత్వము యుగయుగాలవారికి ఉత్సాహమును కలిగిస్తూ జాతీయ శ్రేయస్సును తీర్చి దిద్దుకోడానికి వినియోగపడాలని మా కోరిక.

## గృహపరిశ్రమలు – ప్రభుత్వ ఆసక్తి

గృహపరిశ్రమలు, చిన్నపరిశ్రమల అభివృద్ధిని ప్రోత్సహించే పథకాలు వాని ఆదర్శలక్ష్యాలను, అభివృద్ధిగాంచడానికి వలసిన అవకాశాలను విస్మరించరాదు.

ప్రజల దైనికావసరాల కుపకరించేవి ఉత్పత్తియగుచూ, సాధ్యమైనంత ఎక్కువమందికి జీవనోపాధిని చిన్నపరిశ్రమలు కల్పించాలి.

జనాభాకు, శక్తిసామర్థ్యాలకు లోటులేని మన దేశంలో కుటీర పరిశ్రమల నిర్వహణ మానవశక్తి మీదనే ఆధారపడటం వాంఛనీయము. అందువలన అధిక సంఖ్యాకులకు వృత్తి సౌకర్యాలు అమరుతవి.

అయితే ప్రభుత్వ సహకారం ముఖ్యంగా చిన్న పరిశ్రమలలో ఎలాగుండాలంటే అధికవసతుల సమకూర్చడం, ఉత్పత్తుల నాణ్యమును అజమాయిషీచేయడం, ఉత్పత్తుల విక్రయానికి వసతుల సమకూర్చడంగా నుండాలి.

# శ్రీ దుర్ముఖినామ సం॥ర ఆషాఢ - శ్రావణమాసములు

| | | | |
|---|---|---|---|
| 1956 సం॥ జూలై | 16 | సో | స 31.28 స్వా 33 51 త్యా 4.10 దక్షిణాయన పుణ్యకాలము |
| | 17 | మం | ద 32 2 వి 41.19 త్యా 4.15 |
| | 18 | బు | ఏ 33.46 అనూ 44.55 త్యా 4.19 |
| | 19 | గు | ద్వా 36.30 జ్యే 49.26 |
| | 20 | శు | త్ర 40.2 మూ 54.42 |
| | 21 | శ | చతు 44.10 పూషా 60.10 త్యా 4.25 |
| | 22 | ఆ | ○ పౌ 48 37 పూషా 0 33 త్యా 4 24 |
| | 23 | సో | కృపా 53.7 ఉషా 6.33 త్యా 4.24 |
| | 24 | మం | వి 57.22 శ్ర 12.3 త్యా 4.23 |
| | 25 | బు | తృ 60.10 ధ 18.7 |
| | 26 | గు | తృ 0.57 శత 23.10 |
| | 27 | శు | చ 3 53 పూభా 27.25 |
| | 28 | శ | పం 5.51 ఉభా 30.36 త్యాజ్యాభావః |
| | 29 | ఆ | ష 6.43 రే 32.46 త్యా 49.0 |
| | 30 | సో | స 6.23 అశ్వ 33 42 |
| | 31 | మం | అ 4.48 భర 33 22 |
| 1956 సం॥ ఆగస్టు | 1 | బు | న 2.0 ఏవ్యం 56.16 కృ 31.51 |
| | 2 | గు | ఏ 53.17 రో 29.17 త్యా 3.50 రా 10.52 త్యా 3.47 |
| | 3 | శు | ద్వా 47.31 మృ 25.52 త్యా 3.44 |
| | 4 | శ | త్ర 41.12 ఆర్ద్రా 21.47 |
| | 5 | ఆ | చ 34.34 పున 17.18 త్యా 3.42 |
| | 6 | సో | ● అమా 28.0 పు 12.42 |
| | | | **శ్రావణమాసము** |
| | 7 | మం | శుపా 21.39 ఆశ్లే 8.16 తిధిద్వయం, మంగళగౌరీవ్రతారంభం |
| | 8 | బు | విది 15.46 మ 4.14 త్యా 3.47 మహమ్మదీయ సంవత్సరారంభము |
| | 9 | గు | తృ 10.39 పూఫ 0.55 స్వర్ణగౌరీవ్రతం, నాగచతుర్థి |
| | 10 | శు | చ 6.24 హ 46.45 త్యా 3.5 నాగపంచమి |
| | 11 | శ | పం 3.15 చి 56.32 త్యా 3.9 |
| | 12 | ఆ | ష 1 1 స్వా 57 32 త్యా 4.4 |
| | 13 | సో | స 0.36 విశా 59.45 |
| | 14 | మం | అ 1 8 అనూ 60.10 |
| | 15 | బు | న 2.50 అనూ 3.21 రాజ్యపతాకోత్సవము |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-8-0. అర్థసంవత్సరపు చందా రు. 2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువమైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితలకట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసము లందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

---

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.




# లోధ్ర




సేవించి ఆరోగ్య ★★★ సౌందర్యాలు పెంపొందించుకొంటూ ఉత్సాహంగా వుండడము ఆమె చేతనవును.

"లోధ్ర" ఋతు దోషాలను పారద్రోలి ఆరోగ్య సంతోష సంతానములను సంప్రాప్తింపజేయును

**కేసరి కుటీరం (ప్రైవేట్) లి.**
**రాయపేట, మద్రాస్.**